
రామ్, శ్యామ్‌లు
ప్రఖ్యాత స్మగ్లర్లను పట్టేశారు


రామ్, శ్యామ్‌లు నడుస్తున్నారు
సరదాగా, ఆగిచూసారు
ఓ వింత దృశ్యం కనపడగా


"చూడు, రామ్!
అతనుదొంగ కాదు
అతనే స్మగ్లర్ల నాయకుడు?"


"త్వరపడండి ఇన్‌స్పెక్టర్
ఈ దారిన పదండి, త్వరగా
ఆ స్మగ్లర్లను పట్టుకోండి!"


పరిగెత్తుతున్నారు స్మగ్లర్లు కాలిసత్తువ కొద్దీ
కాని అంతలోనే జారిపడ్డారు అదేమిటో!


"నేనునేలపై జార్చిన పాపిన్స్
అందుకు కారణం, విప్పి మనమూ
తిందాం మజా మజాగా ఈక్షణం!"


PARLE
POPPINS
MIXED FRUITY SWEETS

# వనిత

## మహిళల మనోవికాసానికి దోహదం చేసే వనితా పక్ష పత్రిక

పది భాషలలో చందమామ, రెండు భాషలలో సినిమా పత్రికలు (విజయచిత్ర, బొమ్మై) ప్రచురిస్తూ మీకు సుపరిచితమైన చందమామ పబ్లికేషన్స్ సంస్థ — కేవలం స్త్రీలకోసమని ప్రత్యేకంగా 'వనిత' పేరిట తెలుగులోనూ 'మంగై' పేరిట తమిళంలోనూ రెండు పత్రికలు ఆరంభిస్తున్నదని తెలియజేయడానికి ఎంతో సంతోషిస్తున్నది.

1975 వ సంవత్సరం 'వనితావత్సరం' గా ప్రపంచం పాటించనున్న తరుణంలో ఆ చిహ్నంగా ఈ పత్రికను వెలువరించడం విశేషంగా భావిస్తున్నది.

'వనిత' పదిహేనురోజులకు ఒకసారి వెలువడుతుంది. 'విజయచిత్ర' సైజులో వర్ణ చిత్రాలతో ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌తో వెలువడుతుంది....స్త్రీలకు ఉపయోగపడే పలు శీర్షికలు, రచనలు, కథలు, వ్యాసాలు, నవలలు మొదలైన అంశాలతో వెలువడుతుంది....

**వనితా పాఠకులకు మనవి :**

- 'వనిత' పత్రిక మీది. ఈ పత్రిక రూపురేఖలు ఎలా వుంటే బావుంటుంది? ముఖ చిత్రం ఎలా వుండాలి? లోపల ఎలాంటి శీర్షికలు వుంటే, మీకు నచ్చుతాయి? ఇలాంటి పత్రికను ప్రారంభించ డంలో మీకు గల అభిప్రాయం ఏమిటి?
- మీ మీ ఊహలూ, ఉద్దేశాలూ దయచేసి మాకు తెలియజేయగోరుతున్నాము. మంచి సూచనలు చేసే స్త్రీ పాఠకులకు పారితోషికం కూడా పంపదలచుకున్నాము.
- మీ అభిరుచుల మేరకు, మిమ్మల్ని మెప్పించే విధంగా పత్రికను రూపొందించడానికి మీ సలహాలు మాకు ఎంతగానో ఉపకరిస్తాయి.
- పత్రిక ఏ నెల నుంచి వెలువడేది — వెల ఎంత? పేజీలు ఎన్ని? — మొదలైన విషయాలు త్వరలోనే తెలియజేయగలము. మీమీ అభిప్రాయాలు—

ఎడిటర్ 'వనిత'
చందమామ బిల్డింగ్స్, మద్రాసు 600026
చిరునామాకు 'పోస్ట్' చెయ్యగోరుతున్నాము.

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

---

ఈ నెల బేతాళకథ [''బతికున్న పిశాచాలు''] కు ఆధారం బూర్లె నాగేశ్వరరావు రచన.

పిశాచాలంటే భయంకరమైనవి అనుకుంటాం. బతికున్న పిశాచాలను అందరమూ ప్రత్యక్షంగా చూస్తున్నాం. అధికారం అండన ఉండే ఈ పిశాచాలను చూసి ప్రజలు గుర్తించకపోగా, గౌరవిస్తారు. అలాటి సందర్భంలో నిజమైన పిశాచాల సహాయంతో బతికున్న పిశాచాలను బట్టబయులు చెయ్యటం అన్నది గొప్ప కల్పన.

---

సంపుటి 56 ఫిబ్రవరి'75 సంచిక 2





# మిత్రభేదం

## 20

పిచ్చుకా, వడ్రంగిపిట్టా, తుమ్మెదా కలిసి కప్పను చూడ బోయాయి. కప్ప అంతా విని, "మన లాటి గొప్ప వాళ్ళు పూనుకుంటే ఈ ఏనుగు లాటి పరమమూఢుణ్ణి కడతేర్చుట మెంత పని? మిత్రమా, తుమ్మెదా, నువు ఝుంకారం చేస్తూ వెళ్ళి, ఏనుగు కళ్ళముందు ఎగురుతూ, కుట్టటానికి ప్రయత్నాలు చెయ్యి. ఏనుగు భయపడి కళ్ళు మూసుకుంటుంది. అప్పుడు వడ్రంగిపిట్ట దాని కన్ను ఒకటి పొడిచేస్తుంది. ఏనుగు కంగారుపడి రెండో కన్ను కూడా మూసుకుని పరిగెత్త నారంభిస్తుంది. అప్పుడు వడ్రంగిపిట్ట దాని వెంటపడి రెండో కన్ను కూడా పొడిచేస్తుంది. ఏనుగు నీటిమడుగులో చేరదామని వెర్రిగా అటూ ఇటూ పరిగెత్తుతుంది. అప్పుడు నేను ఒక అగాథం అంచున కూర్చుని బెకబెకలాడతాను. నేను అరిచే దిక్కుగా నీటిమడుగు ఉన్నదనుకుని, ఏనుగు పరిగెత్తుకుంటూ వచ్చి, అగాథంలోపడి చచ్చి ఊరుకుంటుంది. ఆ విధంగా దాని పీడ విరగడై పోతుంది," అన్నది.

కప్ప చెప్పినట్టే చేసి, తుమ్మెదా, వడ్రంగిపిట్టా కలిసి, ఏనుగును అగాథంలో పడేసి చంపేశాయి.

తన భార్య చెప్పిన, "పిచ్చుకా — ఏనుగూ" కథ విని ఉల్లంకిపిట్ట, "సరే, నేను ఈ రోజునే నా మిత్రులనందరినీ సమావేశ పరుస్తాను. తరవాత అందరమూ కలిసి సముద్రాన్ని ఎండగట్టేస్తాం," అన్నది.

అది పక్షులన్నిటినీ పిలిచి, సముద్రం తమ గుడ్లకు చేసిన అన్యాయం గురించి

చెప్పింది. పక్షులన్నీ తమ ముక్కులోకి సముద్రజలాన్ని తీసుకుని, సముద్రంలో నీరు లేకుండా చెయ్యటానికి ప్రయత్నించాయి. కాని అందువల్ల ఫలితం ఏమీ లేకపోగా, అవి సముద్రాన్ని తమ రెక్కలతో కొట్టాయి. అందువల్ల కూడా ఫలితం లేకపోయేసరికి, అవి మట్టి బెడ్డలను తెచ్చి వేసి, సముద్రాన్ని పూడ్చ్పయత్నించాయి.

అప్పటికీ ఫలితం లేకపోవటం చూసి, ఒక వివేకం గల పక్షి, 'చూడండి! మనంతట మనం సముద్రాన్ని కాళ్ళ బేరానికి తీసుకురాలేం. మర్రిచెట్టు కింద ఒక ముసలిబాతు ఉన్నది. అది మనకు తగిన సలహా ఇస్తుంది. అది ఒకప్పుడు తన సలహాతో ఒక బాతులమందను బోయవాడి ఉచ్చుల నుంచి విడిపించింది. అందుచేత మనం దాని సలహా అడుగుదాం,'' అన్నది.

''ఏమిటా కథ?'' అని ఇతర పక్షులు అడిగాయి. వివేకం గల పక్షి ఇలా చెప్పింది:

ముసలిబాతు కథ

ఒక అరణ్యంలో ఒక మహావృక్షం ఉండేది. దానికి లెక్కలేనన్ని శాఖలు ఉండేవి. ఆ చెట్టు మొదట్లో ఒక లత మొలిచి పెరగనారంభించింది.

ఒక ముసలిబాతు అడబాతులతో, ''ఈ లత చెట్టు పైకి ఎగబాకితే, దాని సహాయంతో శత్రువులు చెట్టు పైకి ఎక్క



గలుగుతారు. అందుచేత మనం ఇప్పుడే ఈ లతను తుంచేద్దాం,'' అన్నది.

అడబాతులు నవ్వి, ''ఈ లత మనని ఏం చెయ్యగలదు?" అన్నాయి.

లత చెట్టు పైకి ఎగబాకింది. ఒకనాడు ఒక బోయవాడు ఆ లత సహాయంతో చెట్టు మీదికి ఎక్కి, బాతులన్నీ ఆహారం కోసం వెళ్ళి ఉన్న సమయంలో ఉచ్చులు పన్నాడు. తిరిగి వస్తూనే బాతులన్నీ ఉచ్చులలో చిక్కుకు పోయాయి. అవి తప్పించుకునేటందుకు చేసిన ప్రయత్నాలు వ్యర్థమయాయి.

''నా మాట వినక ఈ దుస్థితి తెచ్చుకున్నారు,'' అన్నది ముసలిబాతు.

''అది నిజమే. ఇప్పుడు ఈ ఆపద తప్పే ఉపాయం చెప్పు,'' అన్నాయి మిగిలిన బాతులు.

''ఇప్పుడు మనమంతా కదలకుండా పడిపోయి, చచ్చినట్టు నటింతాం. తరవాత బోయవాడు వచ్చి, మనమంతా చచ్చామనుకుని, ఒకొక్కరినే ఉచ్చునుంచి తీసి కింద పడేస్తాడు. చిట్టచివరి పక్షి కింద పడినదాకా కదలకుండా ఉండి తరవాత అందరమూ ఒక్క పెట్టున ఎగిరిపోదాం,'' అన్నది ముసలిబాతు.

మర్నాడు ఉదయం బోయవాడు వచ్చి, పక్షులన్నీ చచ్చాయనుకుని, ఉచ్చులు విప్పి, నిశ్చింతగా ఒకొక్క బాతునే కింద పడెయ్యసాగాడు. అన్నిటినీ పడేసి వాడు చెట్టు దిగి రాబోతూండగా, అన్ని బాతులూ ఒక్కసారిగా లేచి ఎగిరిపోవటం చూసి వాడికి అమిత ఆశ్చర్యం కలిగింది.

ఈ కథ విన్న మీదట పక్షులన్నీ వెళ్ళి, ముసలిబాతును కలుసుకుని, సముద్రం పొంగి ఉల్లంకిపిట్ట పెట్టిన గుడ్లను కాజేసిన విషయమంతా చెప్పాయి.

''మనమంతా కలిసి, మనకు రాజూ, మహావిష్ణువుకు వాహనమూ అయిన గరుత్మంతుడి దర్శనం చేసుకుందాం. అతను జాలిగుండె గలవాడు,'' అన్నది ముసలిబాతు.






# 8

[విచిత్రకవలలను వెతికి తెచ్చేందుకు బయలుదేరిన కవలసోదరులు, అరణ్యంలో ఒక గడ్డం వాడికి దొరికిపోయి, చివరకు వాణ్ణి ఓడించి, వాడి నుంచి అపూర్వ శక్తులు గల భస్మాలూ, అంజనాలూ తీసుకున్నారు. ముగ్గురూ కొంతదూరం అరణ్యంలో ప్రయాణించిన తరవాత, ముందుపోతున్న ఉదయనుడు హఠాత్తుగా మాయమయ్యాడు. తరవాత—]

ఉదయనుడు కనిపించకుండా పోగానే సంధ్యా, నిశీధులు తమ గుర్రాలను లాగి పట్టి, వేగం తగ్గించి, నెమ్మదిగానే ముందుకు సాగారు. కొంత దూరం పోయేసరికి భవనం ముందువైపున, ఒక పెద్ద కందకం కనిపించింది. తమ సోదరుడు గుర్రంతో కూడా అందులో పడిపోయివుంటాడని సంధ్యా, నిశీధులు గ్రహించారు; కాని బ్రహ్మాండమైన లోతుగల ఆ కందకంలో ఉదయనుడి జాడగానీ, అతడి గుర్రం జాడగానీ కనుపించ లేదు.

సంధ్యా, నిశీధులకు ఏమీ పాలు పోయింది కాదు. భవనంలోకి ప్రవేశిద్దామా అంటే, కందకం వెడల్పు కాస్తా కూస్తా కాదు. పోనీ, కందకానికి అసలు మొదలెక్కడో, చివరఎక్కడో కనిపెడితే భవనంలోకి తేలికగా ప్రవేశించ వచ్చును కున్నారు.



9



ఇలా ఆలోచించి సంధ్యా, నిశీథులు గుర్రాలను నడిపించుకుంటూ కందకం అంచునే అడుగులు వేయజొచ్చారు. కాని, ఎంత దూరం పోయినా కందకానికి దరీ అంతూ కనబడ లేదు. తిరిగి తిరిగి వారు మళ్ళీ బయలుదేరిన చోటుకే వచ్చేశారు. దీనిని బట్టి ఆ కందకానికి మొదలూ చివరా లేదనీ, భవనంలో ఎవరూ చొరవీలు లేకుండా వుండటానికే, చుట్టూతా ఈ కందకం త్రవ్వబడిందనీ అనుకున్నారు. కాని, ఇంతకూ భవనంలోకి ప్రవేశించే మార్గం స్ఫురించనే లేదు.

కొంతసేపు తీవ్రంగా ఆలోచించిన మీదట సంధ్య, నిశీథుడితో, ''నిశీథా! ఎలాగైనా మనం యీ కందకం దాటి తీరాలి. గుర్రాల మీద దౌడుతీసుకొంటూ వచ్చి, ఒక్కదూకున దాటుదాము. దాటగలిగామా అదృష్టవంతులమే. లేదూ, కందకంలో పడటమే సంభవిస్తే, మన ఉదయనుడి కోసం శాయశక్తులా వెతుకుదాము.'' అంటూ ఉత్సాహపరిచాడు.

ఇందుకు నిశీథుడు కూడా, "భేష్!" అన్నాడు. వాళ్ళు మళ్ళీ తమ గుర్రాల నెక్కి, కొంత దూరం వెనక్కి వెళ్ళి, శరవేగానవచ్చి, ఒక్కదూకులో కందకం దాటారు.

అదృష్టవశాత్తూ, ఇద్దరూ కూడా ఎట్టి ప్రమాదమూ లేకుండా కందకానికి అవతలి గట్టున పడ్డారు. ''ఇదంతా మన ముందు మంచికే సూచనగా కనబడుతున్నది. ఇక ఫరవాలేదు, కోటలో పాగా వేశామన్న మాటే,'' అని అనుకొని సంతోషించారు సోదరులు. ఈ సంతోషంతో వారు భవనం ప్రవేశించారే కాని, తీరా చూడగా ఆ భవనంలో మనుష్య సంచారమే లేదు. లెక్కలేనన్ని ద్వారాలు వున్నై కాని, ఒక్కదానికీ తలుపులు లేవు. వారు ఒక్కొక్కద్వారమే దాటుకుంటూ పోతుండగా, ప్రతి ద్వారానికి ఇరువైపులా మానవుల శిలాప్రతిమలు కనబడినై.

చివరికి వాళ్ళు ఒక పెద్దద్వారం చేరుకున్నారు. నిజానికి అది ద్వారం కానే కాదు. ఒక బ్రహ్మాండమైన రాక్షసుడు, ఈ రూపంలో ఆకాశం ఎత్తున నిలబడి నిద్రపోతూ వున్నాడు. వాడి కాళ్ళ మధ్యనున్న ఖాళీస్థలమే ద్వారంవలె కనిపిస్తున్నది. ఈ రాక్షసుడికి రెండువైపులా రెండు సింహాల ప్రతిమలు వున్నై. అవి జీవకళతో వుట్టిపడుతూ, మీదికి ఉరుకుతామన్నటు భయంకరంగా చూపట్టే సరికి, సోదరులిద్దరూ ఒక్కమాటుగా కెవ్వుమన్నారు.

ఈ కేక చెవిని బడి రాక్షసుధికి మెలకువ వచ్చేసింది. వాడు అమాంతం సంధ్యా, నిశీధులను తన గుప్పిటిలోకి తీసుకుని, "భేష్! భేష్! మరో రెండు విగ్రహాలు!" అన్నాడు ఎంతో ఉత్సాహంతో. వాడు యీమాట అనగానే, వారు భవనంలో చూస్తూ వచ్చిన మానవవిగ్రహాలు ఏదో మాయవల్ల తయారైనవే అని ఊహించగలిగారు.

తలవని తలంపుగా యిలా చిక్కుబడిపోయినందుకు సంధ్యానిశీధులు విచారించారు. కాని, విచారించి వారు చేయగలదేమున్నది?

ఇటువంటి చిక్కులు జీవితంలో ఎన్నో తగులుతూ వుంటై. నిజానికి చిక్కులలో పడి, బుద్ధిబలం వల్ల వాటి నుండి తప్పించుకు బయట పడటంలోనే ఉన్నది మానవుని తెలివి. ఈ ఉద్దేశంతో వారు ధైర్యం తెచ్చుకున్నారు. "చావుకిన్ని





చావులున్నవా? ఏమైతే కానీ, ఒక పథకం వేసి చూస్తాను, ఈ రాక్షసుడికి!'' అనుకున్నాడు, నిశితమైన బుద్ధి నైపుణిగల నిశీధుడు.

అలా అనుకుంటూ నిశీధుడు, రాక్షసుని ఎదుట నించుని, ''ఏమయ్యోయ్, మేము ఎవరమనుకుంటున్నావో: మేము యిక్కడికి దొంగతనంగా రాలేదు. ఫలానా గడ్డపువాడు మీకు ఒక వార్త అందించమని మమ్మల్ని పంపాడు. అందుకే....'' అని యింకా ఏమో చెప్పబోతూండగా, రాక్షసుడు ఆత్రంతో, ''ఏమిటీ, వాడు బతికేవున్నాడా? ఇన్నాళ్ళూ తిరిగి రాకపోయేసరికి, వాడు ఏదో ప్రమాదం వచ్చి చనిపోయాడనుకున్నామే! అయితే యింతకూ వాడు మీకు చెప్పి పంపిన వార్త ఏమిటో త్వరగా చెప్పండి,'' అని తొందర పెట్టాడు.

అప్పుడు నిశీధుడు, రాక్షసుడితో, ''అతని ప్రాణానికేమీ మోసం లేదు. కాని, అతడి జీవిత రహస్యం ఎవరో కనిపెట్టి వేశారట. కనిపెట్టటమే కాదు, అతడి దగ్గిర వున్న భస్మాలూ, అంజనాలూ, తువ్వాలూ కూడా కాజేసి పోయారట. అవి లేనిదే తను ఒక్క అడుగైనా ముందుకి వెయ్యలేడట. అందువల్ల యీ వార్త మీకు అందజేసి, మళ్ళీ కొన్ని అంజనపు డబ్బాలూ, భస్మాలూ పంపమని చెప్ప మన్నాడు,'' అని ఎంతో నమ్మేటట్టు చెప్పాడు.

అంతా విని, రాక్షసుడు, ''అలాగా, పాపం! అందుకనే వాడు తిరిగి రాలేక పోయాడు. ఇంకా నయం, ఆ దుర్మార్గులెవరో, వాడి దండ కాజేశారు కారు. అదే జరిగితే వాడిని రక్షించటం ఎవరి వల్లా కాదు. సరే, యిక నేను పోయి వస్తాను. మీరు మాత్రం ఒక్క పురుగుని కూడా లోపలికి రానివ్వకుండా చూస్తూ వుండండి,'' అనిచెప్పి బయలుదేరాడు.

ఎప్పుడైతే రాక్షసుడు వదిలిపోయాడో, సంధ్యా, నిశీధులు సంతోషంతో ఎగిరి

గంతేశారు. అంతటి రాక్షసుణ్ణి టోపీ వేశాం గదా అని వారు ఉప్పొంగి పోయారు. ఇంతలో నిశీథుడు, "ఇక ఒక్క క్షణం కూడా మనం ఆలస్యం చెయ్యకూడదు. వాడు తిరిగి వచ్చేలోగా మనం యీ భవనం యొక్క రహస్యం ఏమిటో కనుక్కోవాలి," అన్నాడు.

సోదరులిద్దరూ ముందుకు సాగారు. మరికొన్ని ద్వారాలు దాటి, చివరి ద్వారం కూడా దాటి వెళ్ళేసరికి, ఒక పెద్ద కొలను కనుపించింది. అందులో అందాల హంసలు ఈదులాడుతున్నాయి.



ప్రొద్దుటనగా బయలుదేరి హైరానపడుతూవున్న ఆ కవలసోదరులకు చాలా దాహం వేసింది. దప్పిక తీర్చుకుందామని సంధ్య కొలనులో దిగి, పుడిసెడు నీళ్ళు తీసుకుని తాగాడు. కాని, ఆ నీరు గొంతు దిగిందో లేదో, పాపం సంధ్య శిలా ప్రతిమగా మారిపోయాడు.

తన కళ్ళ ఎదటనే సోదరుడు యిలా రాయి అయిపోవటం చూసి, నిశీథుడు ప్రతిమలా నిలుచుండిపోయాడు. "ఇంకా నయం, నేను కూడా తొందరపడి తాగినట్టయితే, నాగతీ యింతే అయేది. ఉదయనుడి గతి ఏమయిందా అని పాలుపోకుండా వున్న ఈ సమయంలో, సంధ్య కూడా యిలా అయిపోయాడే! నాకూ ఏదైనా ఆపద వచ్చిందా, మా అతీగతీ కూడా లోకానికి తెలియకుండాపోతుందే!" అని అనేకవిధాల చింతించాడు.

నిశీథుడు మరికొంతదూరం ముందుకు పోయేసరికి, ఒక పెద్ద తోట కనుపించింది. ఆ తోటలో రకరకాల ఫలవృక్షాలున్నై. అన్నిటికంటే చిత్రమైనది ఒక మామిడిచెట్టు. ఆ చెట్టున వున్న కాయలు యిన్నీ అన్నీ కావు. ఎక్కడో గాని ఆకే కనుపించటం లేదు. అంత విరగ కాచిందన్నమాట ఆ మామిడిచెట్టు.

నిశీథుడికి యిప్పుడు బాగా ఆకలి వేసింది. గబగబ యిన్ని పళ్ళుకోసి, ముందు పడవేసుకుని, ఒక పండు తీసి



తినబోయాడు. కాని చిత్రమేమిటో, పండు కొరకటంతోటే, నిశీధుడు కోతిగా మారిపోయాడు. కోతిగా మారిపోవటంతో, ''అయ్యో బాబో, ఇంకా ఏమి విడ్డూరాలు జరగబోతాయో, యీ రాక్షసమాయలు ఎవరు తెలుసుకోగలరు?'' అనుకొని, నిశీధుడు తక్కిన పళ్ళు తినకుండా, ఎక్కడి వక్కడే వదిలేశాడు. ఆ కోతి రూపంలో వున్న నిశీధుడు, తన సోదరుడైన సంధ్య శిలారూపం దాల్చిన కొలను వద్దకు వచ్చి, దాని చుట్టూ తిరగసాగాడు.

ఇంతలో కొలనులో నించి ఏదో బుడ బుడ మని శబ్దం వచ్చింది. మరి కొద్ది సేపటికల్లా, నీటిలో నించి ఒక హంస తన వైపు రావడం కనుపించింది. ఇదంతా కోతి రూపంలో వున్న నిశీధుడు స్పష్టంగా చూడగలుగుతూనే వున్నాడు.

మరి కొద్ది సేపటికల్లా, ఆ హంస పూర్తిగా బైటికి వచ్చి, ఒక మనిషిగా మారిపోయింది. నిశీధుడు ఎగిరి గంతేశాడు. ఎందుకని? ఆ వచ్చింది కందకంలో పడి కనపడకుండా పోయిన తన ప్రియసోదరుడు ఉదయనుడే!

ఉదయనుడు ఒడ్డుకి రాగానే సంధ్య శిలాప్రతిమ కంటబడి, కొయ్యబారిపోయాడు.

ఇంతలో కోతి రూపంలో వున్న నిశీధుడు, ఉదయనుడి కాళ్ళను చుట్టేసుకున్నాడు. అది మామూలు కోతే అనుకుని మొదట ఉదయనుడు దాన్ని విదిలించి కొట్టాడు. కాని, అది విడవకుండా కాళ్ళను చుట్టేసుకోవటం చూసి, తన సోదరుడైన నిశీధుడే యిలా మారిపోయి వుంటాడని అనుమానించక తప్పలేదు.

ఐతే, ఏమి చెయ్యాలో ఉదయనుడికి తోచలేదు. సంధ్య యిలా రాయిగా ఎందుకు మారాడో, కోతి రూపంలో వున్నది తన సోదరుడు అవునో కాదో తనకు ఎలా తెలుస్తుంది?

కొంత సేపు అలా ఆలోచించి, చటుక్కున ఏదో ఉపాయం స్ఫురించిన

వానిలా తన జేబులో వున్న భస్మాలూ, అంజనాలూ బైటికి తీశాడు. సంధ్య శిలా విగ్రహం పైన నల్ల భస్మం చల్లాడు. ఏమీ కాలేదు. పచ్చ అంజనం రాసి చూశాడు. మార్పు కనిపించలేదు. ఎర్ర అంజనం రాశాడు. అప్పటికీ ఆ శిలా ప్రతిమ అలాగే వుండిపోయింది. ఇన్ని విధాల ప్రయత్నించినా ఫలితం దక్కక పోయేసరికి, ఉదయనుడు ఆ అంజనాలూ భస్మాలూ కోతి రూపంలో వున్న నిశీధుడి పైన చల్లాడు. కాని, యీసారీ వాటివల్ల మార్పు ఏమీ రాలేదు. కోతి కోతిగానే వుండిపోయింది.

ఉదయనుడికి ఏమి చెయ్యాలో పాలు పోక, కొలను ఒడ్డునే కూర్చుని ఆలోచనలో పడ్డాడు. అప్పుడు కొలనులోని హంసలలో ఒకటి, ఉదయనుడి పాదాల ముందుగా పోయింది. ఉదయనుడు చటుక్కున దాన్ని పట్టుకుని, బైటికి తీశాడు. బైటికి రాగానే ఆ హంస ఒక అందాలకన్యగా మారిపోయింది.

ఆ కన్య సిగ్గుతో తల వంచుకొని, మాట్లాడకుండా నిలబడింది. ఆమెతో ఉదయనుడు, "నీ వెవరు? ఇలా హంస రూపంతో, ఎందుకున్నావు? చెప్పితే...." అని యింకా ఏమో అనబోయాడు.

అంతలో, "ఎక్కడరా, మీరూ?" అనే పెద్ద కేక ఒకటి వినిపించింది.

ఎప్పుడైతే యీ కేక వినిపించిందో వెంటనే ఆ కన్య, ఆ వస్తున్నది భవనాన్ని కాపలాకాసే రాక్షసుడే అని తెలుసుకొని, ఉదయనుడితో, "అదంతా తర్వాత చెబుతా. ముందిప్పుడు ప్రాణాలు రక్షించుకోవాలి," అంటూ, సంధ్య శిలా ప్రతిమనూ, ప్రతిమ దగ్గిర వున్న కోతినీ కొలనులోకి తోసివేసింది.

వెంటనే అవి రెండూ హంసలుగా మారిపోయాయి. తర్వాత ఉదయనుడి చెయ్యి పట్టుకుని, తను కూడా కొలనులోకి దూకింది. దూకీ దూకటంతోనే, వాళ్ళిద్దరూ కూడా హంసలైపోయారు.

—(ఇంకా వుంది)





# బతికున్న పిశాచాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అతీతశక్తులు మనిషికి దురహంకారాన్ని కలిగిస్తాయి. అందుకు నిదర్శనంగా నీకు ప్రవీణుడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం సువర్ణగిరిని పాలించిన రాజ సింహుడు వట్టి అసమర్థుడు. ఆయన రాజకీయ వ్యవహారాలన్నీ ప్రభుత్వోద్యోగుల మీద వదిలిపెట్టి, పరిపాలన వారి చిత్తం వచ్చినట్టు చెయ్యనిచ్చాడు. ఈ కారణంగా పరిపాలనలో అంతులేని అవినీతి పెరిగిపోయింది. మంత్రుల దగ్గిర నుంచి ద్వారపాలకుల దాకా అందరూ

## బేతాళ కథలు




అక్రమమైన మార్గాలు అనుసరించి ప్రజలను పీడించుకు తినసాగారు. అధర్మం నాలుగు పాదాలా నాట్యంచేసింది. కాని రాజుకు ఆ సంగతి ఏమాత్రమూ తెలియదు. ఆయనకు రాజోద్యోగులంటే అపారమైన విశ్వాసం.

సువర్ణగిరి లోనే ఒక పేద బ్రాహ్మణుడికి ప్రవీణుడు అని ఒక కొడుకు ఉండేవాడు. చిన్నతనంలోనే ఆ కుర్రవాడి తెలివితేటలు అసాధారణంగా ఉండటం చూసి, తండ్రి అతణ్ణి సమస్త శాస్త్రాలూ, విద్యలూ నేర్చుకోనిచ్చాడు. తరవాత ప్రవీణుడు ఎక్కడెక్కడో ఉన్న విశ్వవిద్యాలయాలకు వెళ్ళి, అంతులేని పాండిత్యం అలవరచుకుని సువర్ణగిరికి తిరిగివచ్చాడు.

మహాపండితుడై తిరిగి వచ్చిన తన కొడుకు ఆ పాండిత్యం ద్వారా జీవనోపాధి కల్పించుకుంటాడని తండ్రి అనుకున్నాడు. కాని అలా జరగలేదు. ప్రవీణుడు, తిరిగి వచ్చినాక తన చుట్టూ ఉన్న జీవితం చూసి, విచారంలో మునిగిపోయాడు.

''నాయనా, మనం పేదవాళ్ళం గదా. నీ పాండిత్యమే మనకింత తిండి పెట్టాలి. నువు నీ పాండిత్యాన్ని ప్రదర్శించి సన్మానాలూ, సత్కారాలూ పొందక, ఇంట్లోనే కూర్చుంటే ఎలా జరుగుతుంది?'' అన్నాడు తండ్రి.

''నా చదువు అంతా వ్యర్థమని నాకు తోస్తుంది. జీవితం చూస్తున్నకొద్దీ నాకు జీవితం మీదనే విరక్తి కలుగుతున్నది. నేను నా పాండిత్యాన్ని ప్రదర్శించి ఎవరినుంచి సన్మాలు పొందను? నన్ను సన్మానించ గలవాళ్ళు ఎటువంటి వాళ్ళో నాకు తెలిసిపోయింది.'' అన్నాడు ప్రవీణుడు.

తండ్రికి తన కొడుకు పాండిత్యం గురించి అనుమానం వచ్చింది. ప్రవీణుడి చదువులో ఏదో లోపం ఉన్నదనీ, అందుచేతనే మనిషి విరక్తిగా ఉన్నాడనీ

ఆయన అనుకున్నాడు. ఆయన తనకు తెలిసిన గొప్ప పండితులను పిలిపించి, వారిచేత తన కొడుకుతో చర్చలు జరిపించాడు. వాళ్ళు ప్రవీణుడితో కొద్ది సేపు మాట్లాడి, అతని తండ్రితో, "బాబూ, నీ కడుపున రత్నం పుట్టాడు. అతను ఉద్దండ పండితుడు!" అని చెప్పి వెళ్ళిపోయారు.

ఈ పండితుల మూలానే ప్రవీణుడి సంగతి రాజుగారి దాకా వెళ్ళింది. రాజుగారు ప్రవీణుడికి ప్రత్యేకమైన ఆహ్వానం పంపాడు. ప్రవీణుడి తండ్రికి ఎంతో ఆనందం కలిగింది. ప్రవీణుడు మాత్రం రాజసభకు వెళ్ళే అభిప్రాయం కనబరచ లేదు. తండ్రి అతనికి ఎన్నో విధాల బోధలు చేసి, తనవెంట అతన్ని రాజ సభకు తీసుకువెళ్ళాడు.

ప్రవీణుడు రాజును చూస్తూనే, "నన్నెందుకు పిలిపించారు?" అని అమర్యాదగా అడిగాడు. సభలో అందరూ నిర్ఘాంతపోయారు.

రాజు కోపం తెచ్చుకోక, "నువు గొప్ప పండితుడివని విని, నిన్ను ఘనంగా సత్కరించటానికి పిలిచాను," అన్నాడు.

ప్రవీణుడు విరగబడి నవ్వాడు.

"ఎందుకలా నవ్వుతావు?" అని రాజు అసహ్యపడుతూ అడిగాడు.



"మీ పరిపాలనలో ప్రజలు తిండికి మాడి చస్తున్నారు. మీ అధికారులు వాళ్ళ రక్తాన్ని జలగల్లాగా పీల్చుతున్నారు. మీ బొక్కసం నిండా ప్రజల నుంచి దోచిన ధనం ఉన్నది. ఒక అసమర్థుడి చేత అక్రమ ధనంతో సన్మానం పొందట మంటే నాకు నవ్వు వచ్చింది," అన్నాడు ప్రవీణుడు.

రాజు మండిపడి, "మూర్ఖుడా, ఒళ్ళు తెలిసి మాట్లాడుతున్నావా? ఎవరితో మాట్లాడుతున్నదీ తెలుసుకోలేని నువు ఒక పండితుడివా? నువ్వన్నట్టు నా పరిపాలన అసమర్థంగా ఉంటే నువు దాన్ని సరిచెయ్యి. నీ ఆరోపణలు నిరూ



పించుకో. లేకపోతే నిన్ను క్రూరంగా శిక్షించి, దేశబహిష్కారం చేస్తాను,'' అన్నాడు.

ప్రవీణుడు జవాబు చెప్పలేదు.

''ఈ ద్రోహిని యాభై కొరడా దెబ్బలు కొట్టి, దేశంనుంచి వెళ్ళగొట్టండి!'' అని రాజు పట్టరాని కోపంతో తన భటులను ఆజ్ఞాపించాడు.

ప్రవీణుడు కొరడా దెబ్బల శిక్ష అనుభవించి, బయలుదేరాడు. జీవితం మీద అతనికి పూర్తిగా విరక్తి కలిగింది. తన పాండిత్యం తనను ఎందుకూ పనికిరాని వాణ్ణి చేసిందనుకుని అతను చచ్చిపోవటానికి నిశ్చయించుకున్నాడు.

దారీ తెన్నూ పాటించకుండా వెళ్ళిపోతున్న ప్రవీణుడికి ఎదురుగా ఒక శ్మశానమూ, అందులో కాలుతున్న ఒక శవమూ కనిపించాయి. ఆ చితిలో నే తానుకూడా కాలిపోదా మనుకుని అతను చితి సమీపానికి వెళ్ళేసరికి అతనికి ఒక వింత కనిపించింది. చితి సమీపంలో కొన్ని పిశాచాలు పెద్ద ఎత్తున ఏదో తంతు జరుపుతున్నాయి. ప్రవీణుడు కొంచెం దూరాన నిలబడి పిశాచాలు జరిపే తంతు ఆసక్తితో గమనించాడు.

పిశాచాల మధ్య రెండు పుర్రెలు నేల మీద పక్కపక్కగా పెట్టి ఉన్నాయి. వాటికి కల్యాణం బొట్లున్నాయి. వాటి ముందు పెళ్ళితతంగానికి అవసరమైన వస్తువులన్నీ పెట్టి ఉన్నాయి. కొన్ని పిశాచాలు ఎముకలతో సన్నాయి వాయిస్తున్నాయి. మరి కొన్ని మట్టికుండలు బోర్లించి, దరువులు వేస్తున్నాయి. మిగతా పిశాచాలు నృత్యం చేస్తున్నాయి.

ఆ పిశాచాలను చూస్తుంటే ప్రవీణుడికి చాలా సంతోషం కలిగింది. మనుషుల జీవితంకన్న వాటి జీవితం లక్షరెట్లు బాగున్నది! అతను చితికి సమీపంగా వచ్చేసరికి ఎక్కడి పిశాచాలు అక్కడ ఆగిపోయాయి. ప్రవీణుడు చితిలోకి దూకబోయాడు.

రెండు పిశాచాలు అతన్ని పట్టి ఆపి, "ఎందుకు చావాలనుకుంటున్నావు?" అని అడిగాయి.

"చచ్చి మీలాగా పిశాచాన్ని అవుతాను. ఏ బాధలూ వుండవు." అన్నాడు ప్రవీణుడు.

"పిచ్చివాడా, చచ్చినవాళ్ళంతా పిశాచా లవుతారనుకున్నావా? మానవ జన్మ ఉత్తమమైనది. నువు ఎందుకు చావాలనుకుంటున్నావో చెప్పు. నీ కారణాలు సరి అయినవైతే నిన్ను చావనిస్తాం." అన్నది ఒక పిశాచం.

"ఛీ, ఛీ! మానవ జన్మకన్న హీనమైనది లేదు. ఏ జంతువూ తన జాతిని తాను తినదు. ఆ పని మానవుడు ఒక్కడే చేస్తున్నాడు. దానికి నీతినియమాలు లేవు. బిచ్చగాడు హంతకుడవుతున్నాడు; వ్యాపారులు మోసం చేస్తున్నారు; అధికారులు లంచాలు మరిగారు; పాలకులు ప్రజల రక్తం ధనంగా మార్చుకుంటున్నారు. ధర్మానికి కళ్ళు పొడిచారు. న్యాయానికి నోరు కుట్టేశారు. పండితులు తమ పాండిత్యం అమ్ముకుంటున్నారు. ఆడవాళ్ళు శీలాన్ని అమ్ముకుంటున్నారు. అందుచేతనే నేను చచ్చి, మీలో ఒకణ్ణి అవుదామనుకుంటున్నాను." అన్నాడు ప్రవీణుడు.



పిశాచం నవ్వి, "నువు చెప్పిన వాళ్ళే చచ్చి పిశాచాలు కాగలరు. నీలాటివాడికి పిశాచం అయే అవకాశం లేదు. మేమంతా బతికి ఉండగా పాపాలు చేసి పిశాచాలం అయాం. ఇడుగో, ఇతను కల్తీ సరుకులు అమ్మిన వ్యాపారి. ఇతను ప్రజల ధనాన్ని అబద్ధాలతో కొల్లగొట్టిన ప్రభుత్వోద్యోగి. ఇతను వైద్యుడు; మందు తీసుకున్నవాళ్ళ దగ్గిర డబ్బు గుంజీ, డబ్బు ఇవ్వనివాళ్ళను రోగాలతో చావనిచ్చి చాలా పాపాలు చేశాడు. మేమంతా చచ్చి పిశాచాలమైనాక మాలో స్వార్థం లేదు, కుతంత్రాలు లేవు; అందరమూ కలిసి కట్టుగా జీవిస్తున్నాం. ఈ జీవితంలో




చాలా హాయి ఉంది. అది మాకు చచ్చి నాకే తెలిసింది,'' అన్నది.

''అదృష్టవశాన నేను కూడా పిశాచాన్ని అవుతానేమో. నన్ను కూడా చావనివ్వండి. నాకు మీలాగా జీవించాలని ఉన్నది,'' అన్నాడు ప్రవీణుడు.

పిశాచం ఇలా అన్నది:

''నువు ఎన్నటికీ పిశాచం కాలేవు. ఈ పుర్రెలు చూడు. వీళ్ళిద్దరూ బతికి ఉండగా, కులమత భేదం పాటించకుండా, ఒకరినొకరు మనసారా ప్రేమించుకున్నారు. వాళ్ళ తల్లి దండ్రులు వాళ్ళ పెళ్ళికి అంగీకరించ లేదు. అందుచేత, వాళ్ళు ఒక వైద్యుడి దగ్గిర విషం కొని, ఒకే పాత్రలో పోసుకు తాగి చచ్చిపోయారు. వాళ్ళను ఒకే గోతిలో పాతేశారు. వాళ్ళు పిశాచాలు కాలేకపోయారు. డబ్బుకు ఆశ పడి వాళ్ళకు విషం ఇచ్చిన వైద్యుడు ఇవాళే చచ్చిపోయాడు. ఈ చితిలో కాలుతున్నది ఆయన శవమే. చచ్చిపోయిన ప్రేమికుల పుర్రెలు పైకి తీసి వాటికి పెళ్ళి చేస్తున్నాం.''

''మీ పిశాచాలతో ఉండటం సాధ్యం కాకపోయినా నాకు చావక తప్పదు. ఎందుకంటే, నేను బతికున్న పిశాచాల మధ్య జీవించలేను,'' అంటూ ప్రవీణుడు చితిలోకి ఉరికాడు. మరుక్షణం ఆ చితి నుంచి బయటికి వస్తున్న పిశాచం ప్రవీణుణ్ణి బయటికి తోస్తూ వచ్చేసింది. ఆ పిశాచం చచ్చిపోయిన వైద్యుడే.

ప్రవీణుడు మండిపడి, "రెండు ప్రాణాలను నిలువునా తీసిన పాపిష్ఠివాడా, నన్ను చావకుండా ఆపటానికి నువు ఎవరు?'' అని వైద్యుణ్ణి అడిగాడు.

''బాబూ, నాలో ఇప్పుడు అలాటి పాపపు ఆలోచనలు లేవు. నువు గొప్ప పండితుడివి. ఆత్మహత్యలు పిరికిపందలు చేసే పని. యువకుడివి. మంచివాడివి. జీవితాన్ని బాగు చెయ్యటానికి ప్రయత్నించు,'' అన్నాడు వైద్యుడు.

ప్రవీణుడు దీర్ఘంగా ఆలోచించి, "నేను ఆత్మహత్య చేసుకునే ప్రయత్నం మానుకుంటాను. మీ పిశాచాలన్నీ కలిసి నాకు ఒక్క సహాయం చెయ్యాలి. చేస్తారా ?" అని అడిగాడు.

"చెప్పు, అలాగే చేస్తాం," అన్నాయి పిశాచాలు.

"నగరంలోని బతికున్న పిశాచాలను తీసుకురండి," అన్నాడు ప్రవీణుడు.

త్వరలోనే నగరంలో ఉండే ఘరానా మనుషులు కొన్ని వందల మంది శ్మశానంలో హాజరయారు. వాళ్ళు తమ చుట్టూ ఉన్న పిశాచాలను చూసి వణికి పోతున్నారు.

"మీరంతా ప్రజలకు ద్రోహం చేసిన వాళ్ళు! అవునా, కాదా ?" అని ప్రవీణుడు అడిగాడు.

వాళ్ళు నోళ్ళు తెరిచారు, కాని జవాబు చెప్పలేకపోయారు.

"మీరందరూ రాజుగారి దగ్గిరికి పదండి. రాజుగారి ఎదట అబద్ధం చెప్పారో, ఈ పిశాచాలు మిమ్మల్ని పీక్కు తింటాయి. మీరు చేసిన అక్రమాలన్నీ రాజుగారి ఎదట ఒప్పేసుకోండి," అని వచ్చినవాళ్ళను హెచ్చరించి, ప్రవీణుడు పిశాచాలతో, "వీళ్ళనందరినీ దర్బారుకు తీసుకురండి," అన్నాడు.



సభ తీరిఉన్న రాజు తన సభలోకి ఘరానా పౌరులందరూ వణికిపోతూ రావటంచూసి ఆశ్చర్యపోయాడు. వీళ్లను తెచ్చిన పిశాచాలు రాజుకుగాని, సభలో ఉన్నవారికిగాని కనిపించ లేదు.

"మీరందరూ ఏ విధంగా రాజుగారిని వంచించి, ప్రజలను పీడించుకుతింటు న్నారో, మీ స్వార్థజీవితం ఏమిటో వివరంగా చెప్పండి," అన్నాడు ప్రవీణుడు బతికున్న పిశాచాలతో.

తమ వెనకనే ఉన్న పిశాచాలకు భయపడి, అందరూ తాము చేసిన పాపా లనూ, తమ అవినీతి పనులనూ ఒప్పేసు కున్నారు. అసమర్థపురాజుకు కనువిప్పు

కలిగింది. ఆయన వారి కందరికీ దేశ బహిష్కరణ శిక్ష విధించాడు. వారితో బాటు వెళ్ళిపోతున్న ప్రవీణుణ్ణి రాజు వెనక్కు పిలిచి, "నువు నా అంతరంగికుడివిగా ఉండి, నా దేశంలో ధర్మపరిపాలన జరిగేటట్టు చూడు," అన్నాడు. అందుకు ప్రవీణుడు అంగీకరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పిశాచంగా జీవించే అవకాశం లేక పోయినా చచ్చిపోవటాని నిశ్చయించిన ప్రవీణుడు పిశాచాల సహాయం దొరకగానే జీవితాన్ని సంస్కరించే ప్రయత్నం ఎందుకు చేశాడు? అతని పాండిత్యానికీ అతని ప్రవర్తనకూ ఏమిటి సంబంధం? అతను పదవి కోసం పాండిత్యాన్ని ఎందుకు వదులుకున్నాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రవీణుడి పాండిత్యానికీ, అతని ప్రవర్తనకూ చాలా గాఢమైన సంబంధం ఉన్నది. అతను నిజమైన పండితుడు; పాండిత్యం అమ్ముకునే ఉద్దేశం కలవాడు కాడు, అది ప్రజల మధ్య రాణించాలనే అభిప్రాయం కలవాడు. అరాజక పరిస్థితిలో పాండిత్యం రాణించదు. అందుకే అతను ఆత్మహత్యకు పూనుకున్నాడు. ఆ అరాజకాన్ని తొలగించే శక్తిసామర్థ్యాలను అతనికి పాండిత్యం ఇయ్యలేదు. పిశాచాలు అందుకు తోడ్పడతాయని తోచగానే అతను వాటి సహాయంతో అరాజకానికి కారకులైన వారిని శిక్షించటానికి పూనుకున్నాడు. అతను రాజుగారి అంతరంగికుడు అయినది కూడా పాండిత్యం ప్రజల మధ్య రాణించే పరిస్థితులు కలిగించటానికే. ప్రవీణుడు ఒక్క క్షణంకూడా తన పాండిత్యాన్ని వదిలిపెట్టలేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# బుద్ధిబలం

ఒక రాజుకు ఇద్దరు భార్యలు. వారిద్దరికీ కొడుకులున్నారు. పెద్దవాడు తెలివైనవాడు. రెండో వాడు కొంత మందమతి. న్యాయంగా యువరాజుగా అభిషేకించవలసినది పెద్దవాణ్ణి. కాని చిన్నరాణి తన కొడుక్కే ఆ పదవి కావాలన్నది.

రాజు ఇద్దరు కొడుకులకూ ఒక పరీక్ష పెట్టి, అందులో నెగ్గిన వాణ్ణి, యువరాజు చేస్తానన్నాడు. ఆయన నిండు సభలో వారిద్దరినీ ఇలా అడిగాడు: "దేశంలో ఏనుగులు ఎద్దులైతే, ఎద్దులు పశువులైతే, పశువులు కుక్కలైతే, కుక్కలు పిల్లులైతే, పిల్లులు ఎలుకలైతే ఆ స్థితిని మార్చి యథాస్థితి కలిగించటానికి ఏం చెయ్యాలి?"

చిన్నవాడు చప్పున, "మంత్రగాణ్ణి పిలిపించి మంత్రం వేయించాలి," అన్నాడు.

పెద్దవాడు కొంచెం ఆలోచించి, "గాదెలు నిండుగా ఉండేటట్టు చూడాలి; నదుల నీళ్ళు వృధాపోకుండా చెయ్యాలి; చెరువులు పూడిక తీయించాలి; జలసమృద్ధికి తగినవన్నీ చెయ్యాలి," అన్నాడు.

"ఆ ప్రశ్నకు ఇదా సమాధానం," అన్నారు కొందరు.

"అవును, క్షామపరిస్థితులు ఏర్పడితేనే నేను చెప్పినట్టు జరుగుతుంది. పెద్దవాడే యువరాజు!" అన్నాడు రాజు.

—బి. దుర్గారావు






# ఎదురు ప్రశ్నలు

పాండ్యదేశానికి చెందిన హరిశంకరుడు అనే గొప్ప విద్వాంసుడు, తనకన్న గొప్పవాడు ఏ దేశంలోనూ లేడనిపించుకోవాలని, అనేక దేశాలు తిరిగి, అనేక దేశాల విద్వాంసులతో వాదించి, వారిని ఓడించి విజయపత్రాలు పుచ్చుకుంటూ, కాలక్రమాన కాశీనగరం చేరుకున్నాడు.

కాశీరాజు హరిశంకరుడి కోరిక తెలుసుకుని, తన ఆస్థానవిద్వాంసులతో అతను వాదించటానికి అనుమతి ఇచ్చాడు.

కాశీ ఆస్థానంలో నలభై తొమ్మిదిమంది విద్వాంసులు ఉండేవారు. వారికి పెద్ద గజకేసరి ఉపాధ్యాయుడు అనే మహా పండితుడు. ఆయన హరిశంకరుడితో, ''పాండిత్యాన్ని వాదానికీ, జయాపజయాలకూ గురిచేసే ఆచారం మాకులేదు. మహాపురాణాలనూ, ఇతిహాసాలనూ రచించిన మహాత్ములు ఎవరితోనూ వాదించలేదు; ఎవరినీ ఓడించనూ లేదు. ఒక విద్వాంసుణ్ణి మరొకడు ఓడించటం ఆ విద్వాంసుణ్ణి అవమానించటమూ, నొప్పించటమూ అవుతుంది. ఎంత గొప్ప విద్వాంసుడైనా, అతనికంటె గొప్పవిద్వాంసుడు ఉంటాడనే మా నమ్మకం. విద్వత్తుకు పరిమితి అంటూ లేదు. అందులో హెచ్చు తగ్గులు సందర్భవశాన అవే తెలుస్తాయి. వాదన ద్వారా వాటిని తేల్చవలసిన అవసరం మాకు లేదు,'' అన్నాడు.

తనను చూసీ, తన ప్రతిభ గురించి వినీ భయపడి గజకేసరి అలా అన్నాడనుకుని హరిశంకరుడు, ''చేతగాని పండితులు ఇలాగే అంటారు. మీలో ఎవరికీ వాదించటం ఇష్టం లేకపోతే, నేను గెలిచినట్టు ఒప్పుకుంటూ విజయ పత్రం ఇయ్యండి,'' అన్నాడు.

ఎల్. అనంతరామయ్య

ఈమాట వింటూనే యువకపండితుడు ఒకడు, "ఆయనను తృప్తిపరచటానికి నేను ఆయనతో వాదిస్తాను. నేను ఇంకా విద్యార్థి దశలోనే ఉన్నాను గనక, ఓడితే నాకు వచ్చే అవమాన మేమీలేదు. ఆయన గెలిస్తే, నన్ను గెలిచినట్టు విజయప్రతం తీసుకుపోతారు. ముందు ఆయన నన్ను మూడు ప్రశ్నలు అడిగితే, తరవాత నేను ఆయనను మూడుప్రశ్నలు అడుగుతాను," అన్నాడు.

రాజు ఇందుకు ఒప్పుకున్నాడు.

"ఈ ప్రపంచంకన్నా పెద్దది ఏది?" అని హరిశంకరుడు అడిగాడు.

"చూడండి, ఆకాశమే!" అన్నాడు యువకపండితుడు.

తన ప్రశ్నకు సరి అయిన సమాధానం వేదాంత అర్థంలో బ్రహ్మం; ప్రాపంచిక అర్థంలో ఆశ అని హరిశంకరుడి అభిప్రాయం. కాని యువకపండితుడి సమాధానాన్ని కాదనటానికి లేదు. అందుచేత హరిశంకరుడు తన రెండవ ప్రశ్న అడిగాడు: "మనిషి గొప్పవాడు కావాలంటే ఏమి చెయ్యాలి?"

"మనసులో అనుకుని మాటలద్వారా అనాలి," అని జవాబిచ్చాడు యువకపండితుడు:

దీనినీ కాదనలేక, హరిశంకరుడు మూడో ప్రశ్నవేశాడు:

"అన్నిటినీ తెలుసుకోవాలంటే ఏం చెయ్యాలి?"



"మనదృష్టీ, సూర్యప్రకాశమూ బాగా ఉంటే అన్నీ తెలుస్తాయి," అన్నాడు యువకపండితుడు.

హరిశంకరుడు ఈ సమాధానాన్ని కూడా కాదనలేక, "నువు చాలాతెలివైన సమాధానాలు చెప్పావు. వాటిలో పాండిత్య ప్రకర్ష ఏమీలేదు," అన్నాడు.

"అవును. నేను చిన్నవాణ్ణి. నా బుద్ధికి తోచిన సమాధానాలు చెప్పాను. అవి తప్పయితే ఖండించండి," అన్నాడు యువకపండితుడు.

"సరే, నీ ప్రశ్నలు అడుగు," అన్నాడు హరిశంకరుడు.

"మీరు ఎక్కడి నుంచి వచ్చారు?" అని యువకుడు అడిగాడు.

ఏం సమాధానం చెప్పాలో హరిశంకరుడికి తెలియలేదు. తాత్వికంగా ఆ ప్రశ్నకు "తెలియదు" అని సమాధానం చెప్పాలి. తాను ఏ వూరి నుంచి వచ్చినదీ ఆ కుర్రవాడికి తెలుసు గనుక ఆ మాట చెప్పి లాభం లేదు.

"నువే చెప్పు," అన్నాడు హరిశంకరుడు.

"అందరూ ఈ లోకానికి ఎక్కడి నుంచి వస్తారో మీరూ అక్కడి నుంచే వచ్చారు. మీరు ఎక్కడికి పోతారు?" అన్నాడు యువకుడు.

దానికి కూడా తాత్వికంగా "తెలియదు" అనే చెప్పాలి.

"నువే చెప్పు," అన్నాడు హరిశంకరుడు.

"మీరు దిగ్విజయం చేసే ఆలోచన మానుకుని మీ దేశానికే తిరిగిపోతారు. మీరు ఇక్కడికి ఏమి తెచ్చారు? ఇక్కడి నుంచి ఏమి తీసుకుపోతారు?" అని యువకుడు మూడో ప్రశ్న వేశాడు.

"ఈ ప్రశ్నకు జవాబు చెప్పగలను. నేను ఇక్కడికి అహంకారం పట్టుకు వచ్చాను. ఆ భారం ఇక్కడ వదిలి, వివేకం తీసుకుపోతాను," అంటూ హరిశంకరుడు యువకపండితుణ్ణి కౌగలించుకున్నాడు.



# 158. ప్రాచీన సురాపాత్రలు

మధ్యధరా సముద్రంలో 2,100 సంవత్సరాల క్రితం ఒక ఓడ మునిగిపోయింది. పురాతత్వ పరిశోధకులు దానిని వెలికతీయగా, అందులో, బొమ్మలో కనబడే మద్యపాత్రల వంటివి కొన్ని వేలు దొరికాయి. వీటితోబాటు ఇంకా అనేక వింతవస్తువులు దొరికాయి. ఇవి గ్రీకు—రోమనులకు చెందినవి.





# చెప్పుకుంటే దేవుడు

ఒకప్పుడు విదర్భదేశంలో మహేంద్రుడు అనే పేరుమోసిన ఐంద్రజాలికుడు ఉండేవాడు. ఆయన రాజులనూ, మహారాజులనూ మెప్పించి, బిరుదులు పొంది, అంతులేని ధనం సంపాదించాడు. అయితే ఆయన దానకర్ణుడి లాటివాడు కావటంచేత ఆయన సంపాదనలో చాలా భాగం ఆయన చేతిమీదుగానే ఖర్చు అయిపోయింది.

మహేంద్రుడి కొడుకు జితేంద్రుడు ఇంద్రజాల విద్యలో తండ్రిని మించినవాడు. కాని అతని కాలంలో ఇంద్రజాల విద్యకు ఆదరం తగ్గిపోయింది. రాబడి సన్నగిల్లినా, జితేంద్రుడు తండ్రిలాగే దానధర్మాలు చేసి పేదరికంవాత పడ్డాడు.

జితేంద్రుడికి ఇద్దరు కొడుకులు. తన కొడుకుల కిద్దరికీ అతను ఇంద్రజాల విద్యలు నేర్పాడు. అది కులవిద్య కావటం చేతనూ, తిరిగి ఇంద్రజాల విద్యకు ఆదరణ పెరగవచ్చునన్న ఆశ ఉండటం చేతనూ, తన కొడుకులకు ఇతర విద్యలేవీ చెప్పించలేదు.

జితేంద్రుడి పెద్ద కొడుకు రాముడు విరివిగా డబ్బు ఖర్చు పెట్టే మనిషి. చిన్నతనంలో తండ్రి వాడికి అడిగినప్పుడల్లా డబ్బులు ఇచ్చేవాడు. పరిస్థితులు మారిన సంగతి వాడి బుర్రకు ఎక్కలేదు. అందుచేత, అడిగినప్పుడు తండ్రి డబ్బులివ్వక పోతే, ఇంట్లోనే దొంగతనాలు చెయ్యసాగాడు. ఇది తెలియగానే జితేంద్రుడు, పట్టరాని ఆగ్రహం వచ్చి, రాముణ్ణి చావగొట్టాడు. రాముడు అలిగి ఎటో పారిపోయి, తిరిగి ఇంటికి రానేలేదు.

కోపంతో కొట్టినా, రాము డంటే వాడి తల్లిదండ్రులకు అమితమైన ప్రేమ.

"వసుంధర"

వాడు వెళ్ళిపోయాక వాళ్ళిద్దరూ వాడి కోసం బెంగపడి, మంచంపట్టి, కొద్ది కాలంలోనే చచ్చిపోయారు. దాంతో, జితేంద్రుడి రెండో కొడుకు చంద్రుడు ఒంటరిగాడై, వీధిపాలయాడు.

చంద్రుడు మనోనిబ్బరం కలవాడు. వాడు ఊళ్ళవెంట తిరిగి, వీధుల్లో గారడీలు చేస్తూ, తన గారడీలు చూసినవాళ్లు ఇచ్చే చిల్లర డబ్బులతో పొట్టపోసుకుంటూ, ఆ సంపాదనతోనే తృప్తిపడి, కాలక్షేపం చేస్తున్నాడు.



ఒకనాడు చంద్రుడు ఒక వీధిలో గారడీ చెయ్యనారంభించాడు. అది చూడటానికి చాలామంది పిల్లలు చేరారు. వాళ్ళనుంచి డబ్బులు రావని తెలిసి కూడా చంద్రుడు తన ఇంద్రజాలంతో వాళ్ళను ఆనందింప జేస్తున్నాడు.

ఇంతలో, పక్కనున్న ఇంటి నుంచి ఒక పిల్లవాడి ఏడుపు గట్టిగా వినిపించింది. చంద్రుడు తన గారడీ ఆపి, ఆ ఇంట్లోకి వెళ్లి చూస్తే, ఒక ఇల్లాలు తన నాలుగేళ్ళ కొడుకును పట్టుకుని చావగొట్టేస్తున్నది.

ఆ పిల్లవాడి తండ్రికి పెద్ద జబ్బుచేస్తే, ఆమె దేవుడికి మొక్కుకున్నదట. జబ్బు తగ్గిపోతే; వారం రోజులపాటు ఇంటిల్లిపాదీ మధ్యాన్నందాకా ఉపవాసం ఉండి, దేవుడి దర్శనం చేసుకుని, తరవాత భోజనం చేస్తామని ఆమె మొక్కుకున్నది. దేవుడి అనుగ్రహం వల్ల జబ్బు నయమయింది. ఎలాగో ఆరు రోజులు గడిచాయి. ఇవాళ కుర్రవాణ్ణి మధ్యాన్నం దాకా ఆపడం కష్టమైపోతున్నది. వాడు ఆకలో అని ఏడుస్తున్నాడు. ఆమె దేవుడి దర్శనానికి వెళ్ళవలసి ఉన్నది. మంచిగా చెబితే వాడు వినడం లేదని, ఆమె వాణ్ణి దండిస్తున్నది.

పిల్లవాణ్ణి ఆకలితో మాడ్చటమే గాక, వాణ్ణి కొట్టడం అన్యాయమని చంద్రుడికి అనిపించింది. వాడు ఆమెతో వినయంగా, "అమ్మా, చిన్నపిల్లలలో దేవుడున్నా



దంటారు. ఈ పసిపిల్లవాడిలో దేవుణ్ణి చూడలేని మీరు ఏ దేవుణ్ణి చూడ బోతున్నారో నాకు తెలియడం లేదు," అన్నాడు.

ఆమె ఈసడింపుగా, "అందుకే నీ బ్రతుకు ఇలా ఉంది! వీడిలో నిజంగా నీకు దేవుడు కనిపిస్తే వీణ్ణి కాస్త కనిపెట్టి ఉండు. నేను దేవుడి దర్శనం చేసుకుని వచ్చి, నీకూ్కాడా భోజనం పెడతాను," అన్నది.

చంద్రుడు సరేనని, చిన్నపిల్లవాణ్ణి మాయమాటలతోనూ, చిన్న చిన్న గారడీ పనులతోనూ మరిపించ గలిగాడు. ఆమె కొంతసేపటికి తిరిగి వచ్చి, చంద్రుణ్ణి మెచ్చుకుని, వాడికికూడా భోజనం పెట్టింది.

భోజనమయాక చంద్రుడు ఆమెతో, "అమ్మా, కన్న కొడుకుకంటె ఎక్కువ అని మీరు అనుకునే దేవుడు ఎక్కడ ఉన్నాడు? నాకూ చూడాలని ఉన్నది," అన్నాడు.

ఆమె నవ్వి, "దేవుడంటే మామూలు దేవుడు అనుకున్నావా? ప్రత్యక్ష దైవం! నీతో మాట్లాడతాడు! నీ ప్రశ్నలకు సమాధానాలిస్తాడు! నిన్ను చల్లగా చూసి నీ బాధలన్నీ పోగొడతాడు!" అన్నది.

చంద్రుడి కుతూహలం మరింత ఎక్కువ అయింది. అతను ఆమె చెప్పిన చోటికి వెళ్ళాడు. అక్కడ జనం విపరీతంగా ఉన్నారు. అందరూ మౌనంగా కూర్చుని ఉన్నారు. ఒక ఎత్తయిన ఆసనం మీద గడ్డమూ, మీసాలూ పెట్టుకుని సాధువులా కనబడే ఆయన కూర్చుని ఉన్నాడు. మంచిగా ఉండమని ఆయన ప్రజలకు ఉపదేశం చేస్తున్నాడు; ఆపదలున్న వారిని తన వద్దకు రమ్మనీ, ప్రజల కష్టాలు తొలగించడానికే తాను ఈ అవతారం ఎత్తాననీ చెబుతున్నాడు. మధ్య, మధ్య ఆయన గాలిలో నుంచి విభూతి సృష్టించి, మనుషుల మీద విసురుతున్నాడు; అప్పుడప్పుడూ గాలిలో తేలి

కొద్దిక్షణాలపాటు ఉంటున్నాడు. ఆయన ఇలా రకరకాల మహిమలు ప్రదర్శి స్తూంటే, భక్తులందరూ, "హేపరమాత్మా!" అంటూ హాహాకారాలు చేస్తున్నారు.

చంద్రుడికి ఇదంతా వింతగా కన బడింది. ఆ సాధువు ప్రదర్శించిన విద్య లన్నీ తనకూ వచ్చును. కాని తాను మామూలు గారడీవాడుగానే ఉండి పోయాడు; ఈ సాధువు దేవుడైపోయాడు. ఈ రహస్య మేమిటో తెలుసుకోవాలని, చంద్రుడు ఆ రోజల్లా వేచిఉండి, అర్ధ రాత్రి సమయంలో ఆ సాధువును ఏకాం తంగా కలుసుకున్నాడు.



"ఎవరు నువు?" అన్నాడు సాధువు చంద్రుణ్ణి చూసి.

"నేనొక ఐంద్రజాలికుణ్ణి. మీ ప్రదర్శ నలు చూశాను. వాటిని ప్రజలు మహిమ లుగా కొనియాడుతున్నారు. అవే ప్రదర్శ నలు నేను ఇస్తూంటే, తిండికి డబ్బులు దొరకటం కూడా కష్టంగా ఉన్నది. ప్రజలు మిమ్మల్ని దేవు డంటున్నారు. ఈ రహస్యం తెలుసుకుందామని వచ్చాను." అన్నాడు చంద్రుడు. అతను ఆరోజు తన అనుభవం కూడా సాధువుకు చెప్పాడు.

"ఇందులో రహస్య మేమీలేదు. నేను దేవుడి అవతారాన్ని. నాకు సహజంగా ఉన్న శక్తులను నువు కష్టపడి విద్యగా నేర్చుకున్నావు. నీకు పరికరాలు అవ సరం, నాకు అవసరం లేదు," అన్నాడు సాధువు.

"అలాగా? అయితే నేను నా వేలు తెగకోసుకుంటాను. దాన్ని మీరు మళ్ళీ అతికించగలరా?" అని చంద్రుడు అడిగాడు.

అలాగే నన్నాడు సాధువు. వెంటనే చంద్రుడు తన వేలును చిన్న బాకుతో కోసేసుకున్నాడు. రక్తం ఎర్రగా ప్రవ హించింది. సాధువు, తెగిన వేలును యథాస్థానంలో ఉంచి, ఏదో మంత్రం చదివాడు. రక్తం మాయమై వేలు మామూలుగా అయింది.

"అసంభవం! ఈ విద్య మా కుటుంబం వాళ్ళకు తప్ప ఇంకెవరికీ తెలియదు," అని చంద్రుడు గొణిగాడు.

సాధువు ఉలిక్కిపడి, "నీ పేరు చంద్రుడు కాదూ?" అన్నాడు.

"అవును. మీకెలా తెలుసు?" అన్నాడు చంద్రుడు.

"నేను నీ అన్నను, రాముణ్ణి," అన్నాడు సాధువు చంద్రుడి కేసి ఆప్యాయంగా చూస్తూ. చంద్రుడు తెల్లబోయాడు. అతని నోట మాట రాలేదు.

సాధువు చంద్రుడితో మళ్ళీ ఇలా అన్నాడు:

"నీ ప్రశ్నకు ఇప్పుడు సరి అయిన సమాధానం చెబుతాను. ఈ ప్రపంచంలో అంతా మాయ. నువు ఒక చిన్న పిల్లవాడికి నీ ఇంద్రజాలంతో ఆకలి జ్ఞాపకం రాకుండా చేశావు. ఆ చిన్న పిల్లవాడు నీలో దేవుణ్ణి చూస్తాడు. పెద్దవాళ్ళ విషయంలో అలా కాదు. నేను దేవుడినని చెప్పి ఇంద్రజాలం చేసి దేవుడినయాను. నువు గారడీవాడినని చెప్పి ఇంద్రజాలం చేస్తే గారడీవాడుగానే ఉండిపోయావు. ప్రజలు నీ ఇంద్రజాలమూ, నా ఇంద్రజాలమూ కూడా చూస్తున్నారు. కాని వాళ్ళకు అనుమానం రాదు. ప్రపంచంలో హాయిగా బ్రతకాలంటే విద్య ఉంటే చాలదు. మాటలు చెప్పి, మోసం చెయ్యడం నేర్చినప్పుడే నీ విద్య రాణిస్తుంది. అదే నేను చేసినది. దేవుడినని అబద్ధమాడటం నా బ్రతుకు తెరువు. ప్రజలు మూర్ఖులుగా ఉన్నంత కాలమూ నాకు ఏ లోటూ లేదు. నీ సందేహం తీరింది కద! ఇక వెళ్ళిరా."

చంద్రుడు వెళ్ళిపోయాడు. ఆ తరవాత అతను ఏమయాడో ఎవరికీ తెలీదు. కాని విదర్భదేశంలో తూర్పుపక్క ఒక మారుమూల గ్రామంలో దేవుడు అవతరించాడనీ, ఆయన ఎన్నో మహిమలు ప్రదర్శిస్తున్నాడనీ, ప్రజలు తండోపతండాలుగా చూడటానికి వెళ్లడం ఆరంభమయింది.



# రహస్యమార్గం

ఒక రాజుకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు ధైర్యవంతుడు. రెండోవాడు పిరికివాడూ, మొండివాడూనూ. ఒకనాడు రెండోవాడు తన తండ్రిని, "గొప్ప గొప్ప రాజభవనాల్లో రహస్య మార్గాలుంటాయట. మన భవనంలో కూడా ఉన్నాయా?" అని అడిగాడు. చాలా ఉన్నాయన్నాడు తండ్రి. వాటిని చూస్తానన్నాడు కొడుకు.

"అవి నాకూ, మంత్రిగారికీ తప్ప తెలియరాదు. అయినా వాటితో నీ కిప్పుడేమి అవసరం వచ్చింది?" అని తండ్రి అడిగాడు.

"శత్రువులు మన పైకి వచ్చారనుకోండి. నేను ఎవరి సహాయమూ లేకుండా తప్పించుకు పోవచ్చును గద!" అన్నాడు కొడుకు.

రాజు వెంటనే లేచివెళ్ళి కొడుకుకు ఒక తలుపు తెరిచి, దాని వెనక ఉన్న మెట్లు చూపాడు. కొడుకు ఆ మెట్లు దిగి మార్గం చూడటానికి వెళ్ళాడు. వెంటనే రాజు తలుపు మూసేశాడు.

కొంత సేపటికి రాజుకొడుకు వచ్చి తలుపు తట్టాడు.

"నీలాంటి పిరికివాడు కోటలో ఉండదగడు. ఆ మార్గానే పోతే పొరుగురాజ్యం చేరుతావు. అక్కడే బతుకు. నీముఖం నాకు తిరిగి చూపించకు!" అన్నాడు రాజు.

—మధురాంతకం నరేంద్ర





# రాజుగారి తీర్థయాత్ర

అంగమహారాజు దొడ్డప్రభువు. న్యాయ పాలనకూ, దయాగుణానికీ ఆయన ప్రసిద్ధుడు. ఒకసారి ఆయన రాజ్యంలో కలరా చెలరేగి, ఆయన భార్యా, ఏక పుత్రుడూ ఆ వ్యాధికి బలి అయారు. ఈ దారుణ సంఘటనతో మహారాజు కుంగిపోయి, పరిపాలన పట్ల విముఖుడు అయాడు. అప్పుడు మంత్రులూ, రాజ గురువూ ఆయనను తీర్థయాత్రలు చేసి, దుఃఖం నుంచి బయటపడమని సలహా ఇచ్చారు.

అంగుడు అందుకు సమ్మతించాడు. కాని, మంత్రులు ఆయన తీర్థయాత్రలకు గాను సేనాలూ, పరివారమూ ఏర్పాటు చేయాలనుకుంటే ఆయన అందుకు ఒప్పుకో లేదు.

"నేను ఒంటరిగానే తీర్థయాత్రలు చేస్తాను. రాజరికం నా వెంట తీర్థప్రదేశాలకు రావలసిన అవసరం లేదు," అన్నాడాయన.

"మీరు రాజరికం విడిచిపెట్టి వెళ్ళిపోతే, మీరు తిరిగి వచ్చినదాకా మమ్మల్ని ఎవరు కాపాడుతారు? రాజు లేకుండా రాజ్యపాలన ఎలా సాగుతుంది?" అని మంత్రులు అడిగారు.

"నేను తిరిగి వచ్చేదాకా నా తమ్ముడు సంగుడు మీకు రాజుగా ఉంటాడు," అన్నాడు అంగుడు.

ఈ మాట వినగానే అందరి ముఖాలూ కళాహీనమయాయి. కాని అంగుడు ఆ సంగతి గమనించలేదు. ఆయన ప్రయాణానికి తగిన దుస్తులు ధరించి, ఒక దుడ్డుకర్ర చేత పుచ్చుకుని, సాధారణ యాత్రికుడి లాగా, బయలుదేరిపోయాడు.

సంగుడు కుటిలుడూ, క్రూరుడూనూ. అతనిలో లేని వ్యసనం లేదు. అతను

అధికారదుర్మదుడు. రాజోద్యోగులకు ఇది తెలిసి కూడా, మహారాజు నిర్ణయానికి విరుద్ధంగా నోరు మెదపలేక పోయారు.

సంగుడు సింహాసనం ఎక్కుతూనే పాత మంత్రులందరినీ తొలిగించి, అంగుడికి విశ్వాస పాత్రులైన వాళ్ళను పదవులలో లేకుండా చేశాడు. వారి స్థానాలలో సంగుడి భృత్యులు వచ్చి, ప్రజాపాలనలో ఇంతింత అనరాని బీభత్సం కలిగించారు. సంగుడి మనుషులు కొందరు కొందరి ఇళ్ళలోకి ప్రవేశించి, ఎక్కడెక్కడ ధనం ఉన్నదీ, ఎక్కడెక్కడ చక్కని స్త్రీలు ఉన్నదీ సంగుడికి తెలిపే వాళ్ళు. సంగుడు తిన్నగా వెళ్ళి ధనాన్నీ, స్త్రీలనూ సొంతం చేసుకునేవాడు. అతను దేశంలోని సహజ సంపదను దేశాంతరాలకు ఎగుమతిచేసి, తానూ, తన అనుచరులూ తాగటానికి విదేశ సారాలు తెప్పించుకున్నాడు. అమితంగా పెరిగిపోయిన పన్నుల భారానికి తట్టుకోలేక, దేశంలోని రైతులు పొరుగుదేశాలకు పారిపోయారు. అలాగే శిల్పులూ, కళాకారులూ, మేలి వృత్తుల వాళ్ళూ పరారీ అయారు. బొత్తిగా నిస్సహాయులూ, దేశమంటే ప్రేమాభిమానాలు గలవాళ్ళూ మాత్రమే దేశంలో ఉండిపోయారు. కాని వారికి మనశ్శాంతి గాని, భద్రతగాని ఏ మాత్రమూ సంగుడి



పరిపాలనలో లేకపోయింది. పంట భూములు బీడుపడిపోయాయి. బంగారు తరలించి దేశాంతరాల నుంచి ఆహారం తెప్పించుకోవలసి వచ్చింది. విలాస వస్తువుల దిగుమతి కోసం దేశసంపద ఎగుమతి చెయ్యవలసి వచ్చింది.

సంగుడి సలహాదార్లలో హెచ్చుమంది విదేశీయులు. త్వరలోనే వారు అంతులేని ధనం ఆర్జించుకున్నారు. వాళ్ళు సంగుణ్ణి మరింత నిరంకుశంగా పాలించమనీ, మరింతగా భోగాలలో ఓలలాడమనీ సలహాలిస్తూ వచ్చారు.

"నువు చక్రవర్తివి. సమస్త భోగాలూ అనుభవించాలి," అన్నారు వాళ్ళు.



"నేను రాజప్రతినిధిని మాత్రమే. అసలు రాజు మా అన్న అంగుడు గద!" అన్నాడు సంగుడు.

"మహారాజా, మీ అంత మూఢుడు ఎక్కడా ఉండడు. ఒక సారి సింహాసనం మీద కూర్చున్నాక సర్వశక్తులూ సంక్రమిస్తాయి. మీరు తలచుకున్నదెల్లా చెయ్యవచ్చు. కావాలంటే మీ అన్న అయిన అంగుడికి మరణదండన విధించవచ్చు," అన్నారు వాళ్ళు.

సంగుడు ఈ మాటలు విని చెవులలో వేళ్ళు పెట్టుకుని, వణికిపోతూ, "లేదు, లేదు! నేను అంత పని చెయ్యలేను," అన్నాడు.

"అది పిరికితనం! అలాటి దౌర్బల్యం పనికిరాదు. ఆలోచించండి. అంగుడు తిరిగి రాగానే మీ యీ వైభవాలన్నీ కట్టు పడి పోతాయి. మీ కేసి చూసేవాళ్ళు ఉండరు. అధికారం ఉండదు. స్వేచ్ఛ ఉండదు. వీటన్నిటి కన్న సోదరప్రేమ అన్న బలహీనత ఎక్కువైనదా?" అన్నారు వాళ్ళు.

సంగుడు తన కణతలు నొక్కుకుంటూ, "మీకు ఏది మంచిదనితోస్తే అది చెయ్యండి," అని దిగివచ్చాడు.

అంగుణ్ణి చంపవలసిందిగా ఉత్తరువు వెలువడింది.

మాజీమహామంత్రి రఘుపతి వెయ్యి కళ్ళతో జరిగేదంతా గమనిస్తూనే ఉన్నాడు. ఆయనకు సంగతంతా తెలిసిపోయింది. ఆయన తన టపాపావురాల ద్వారా అంగ మహారాజుకు ఈ వార్త అందజేశాడు. అంగుడు వార్త తెలిసి నవ్వుకున్నాడు.

యాత్రలు చెయ్యటంలో గల శ్రమతో ఆయన మనోవ్యథపోయింది. జీవితం మీద మమకారం తిరిగి వచ్చింది. ఆయనకు ఇప్పుడు తన దేశం మీదా, ప్రజల మీదా అభిమానం తిరిగి తల ఎత్తి, తన దేశానికి తిరిగి రావాలన్న కోరిక బలంగా కలగసాగింది. ఆయన తిరిగి వద్దామనుకుంటున్న సమయంలోనే పావురాల

ద్వారా సంగుడి ఉత్తరువు వార్తతెలిసింది. పావురాల ద్వారానే ఆయన రఘుపతితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఇందు వల్ల సంగుడి దుశ్చర్యలు వివరంగా తెలియవచ్చాయి.

ఎండకు ఎండి, వానకు తడిసి, చలికి వణికి అంగుడు పూర్తిగా మారిపోయాడు. పైగా, ఏడాదిపాటు గడ్డమూ, మీసాలూ పెరిగాయి, జుట్టు జడలు కట్టుకు పోయింది. ఎడమ చంకకు దిగువగా ఉండే పెద్ద, ఎర్రని పుట్టుమచ్చ చూడక పోతే ఆయనను ఎవరూ గుర్తించలేరు.

ఈ లోపల సంగుడి పరివారంలో ఎవరూ అంగమహారాజు జాడ తెలుకో లేకపోయారు. ఒక ఉత్సాహవంతుడు ఏ శ్మశానంలోనో పాతిపెట్టిన ఎవరో మనిషి తల నరికి తెచ్చి, సంగుడి దర్బారులో చూపి, అదే అంగుడి తల అన్నాడు. ఆ తల గుర్తించరాని స్థితిలో ఉన్నది. సంగుడు తప్పతాగిన మైకంలో ఉండి, ఆ తల తెచ్చినవాడికి బహు మానం ఇచ్చేశాడు. ఇప్పుడు అతను రాజుగా అభిషేకం పొందటానికి అడ్డంకి ఏదీ లేదని అతని మంత్రి అన్నాడు. సంగుడు తల ఆడించాడు.

సంగుడి అభిషేకానికి పెద్ద ఎత్తున ప్రయత్నాలు ప్రారంభమయాయి.

ఆ దేశంలో రాజ్యాభిషేకం జరిగినప్పు డల్లా ఒక రహస్యపు తంతు ఆచారంగా జరుపుతారు. అందులో ఐంద్రజాలికుల





అలాటిదే మరొకటి ఇప్పుడు తయారు చేయించారు. ఇంద్రజాలికుల పెద్ద సంపత్ అనేవాడు డెబ్భై ఏళ్ళవాడు. ఇంద్రజాలికుల వంశంవాళ్ళు గొప్ప రాజభక్తిగలవాళ్ళు, కాని చాలా గడుసువాళ్ళు కూడా. అందుచేత, వాళ్ళకు అంగమహారాజు పట్ల ఎంతో అభిమానం, భక్తీవున్నా, పైకి సంగుడి పట్ల లేని అభిమానం నటించి, అతనికి విశ్వాసపాత్రులయారు.

రేపు పట్టాభిషేకమనగా, అంగమహారాజు యాత్రికుడి రూపంలో నగరం ప్రవేశించాడు; నగరంలోని ఆలయానికి నిత్యమూ అనేకమంది యాత్రికులు వస్తూ ఉంటారు. పావురాల టపా ద్వారా ముందుగానే చేసుకున్న ఏర్పాటు ప్రకారం ఆయన ఆ రాత్రి సంపత్ ఇంట గడిపాడు.

రహస్యపు తంతులో పాల్గొనటానికి సంపత్ వెళ్ళేటప్పుడు ఆయన తన వెంట అంగమహారాజునూ, రఘుపతి వద్ద రహస్యంగా ఉండిన అసలు జెండానూ తీసుకుపోయేటట్టు నిర్ణయం జరిగింది. అంగమహారాజును రహస్యంగా కలుసుకున్నప్పుడు సంపత్‌గాని, రఘుపతిగాని ఆయనను పోల్చలేకపోయారు. అంగమహారాజు కొన్ని పాత రహస్యాలు చెప్పి,

కుటుంబం పెద్ద పాల్గొంటాడు. (ఈ ఇంద్రజాలికుల వంశం ఇప్పటి రాజవంశం వెలసిన నాటినుంచీ ఆ దేశంలో ఉంటున్నది.) ఇంద్రజాల ప్రదర్శనం రాజభవనంలోని అభ్యంతర మందిరంలో అభిషేక సింహాసనం ఉండే చోట జరుగుతుంది. ఆ సింహాసనం పక్కనే ఒక పతాక ధ్వజం ఉంటుంది. ఇంద్రజాల ప్రదర్శనం ముగియగానే రాజు ఆరుగురు పురశ్రేష్ఠుల సమక్షంలో అతి ప్రాచీనమైన పట్టు జెండా ఎత్తి, సింహాసనం మీద కూర్చుంటాడు. ఇదే రహస్య తంతు.

అయితే ఆ ప్రాచీనమైన పట్టు జెండా ఇప్పుడు కనిపించ లేదు. అందుచేత

తన పుట్టు మచ్చ చూపిన మీదటగాని వారికి నిజం తెలియలేదు.

"మహారాజును ఎవరూ గుర్తించలేరని రూఢిగా చెప్పగలను. నా పథకం పారి తీరుతుంది. చూడు, రఘుపతీ, మన పక్షాన ఉండే ప్రజలు సంకేతం అందగానే కదిలి రావటానికి సిద్ధంగా ఉండేటట్టు చూశావుగద?" అన్నాడు సంపత్.

"నిప్పు తగిలితే పేలటానికి సిద్ధంగా ఉన్న ఫిరంగిలాగా ఉన్నారు మన ప్రజలు. నువు ఈ జెండాను లోపలికి ఎలా తీసుకుపోదామనుకుంటున్నావు? శోధన చాలా సమర్ధంగా జరుగుతుంది సుమా!" అన్నాడు రఘుపతి.

"నేను నా వెంట ఒక సహాయకుణ్ణి తీసుకుపోవటానికి అనుమతి ఉంటుంది. మహారాజును నేను సహాయకుడుగా తీసుకుపోతాను. నాకూ్కడా ఇంత పొడుగు గడ్డమూ, మీసాలూ ఉన్నాయి గనక మా ఇద్దరి జోడీ ఉచితంగా ఉంటుంది. మా వెంట ఉండే పరికరాలన్నీ తణిఖీ చేస్తారనుకో. అయినా, దేవుడు మేలు చేస్తే, జెండాను వాళ్ళకు తెలియకుండా లోపల చేర్చగలను. ఈ జెండాను దీనికన్న కొంచెం పెద్దవిగా ఉండే రెండు, ఒకే మాదిరి కాగితాల మధ్య ఉంచి, కాగితాల అంచులు అతి



కించేస్తాను. అవసరమైతే జెండాలో ముడతలు లేకుండా చక్కగా ఇస్త్రీ చేస్తాను. మిగిలిన ఇంద్రజాల పరికరాల మధ్య దీన్ని చూసి ఎవరూ అనుమానించరు," అన్నాడు సంపత్.

దేవుడి దయవల్ల అంతా సక్రమంగా జరిగిపోయింది. కాగితాల మధ్య ఉన్న జెండాను ఎవరూ పట్టుకోలేదు. రహస్య సమావేశంలో ఇద్దరు ఐంద్రజాలికులూ, మాజీ మహామంత్రి రఘుపతి కాక, మాజీ రక్షణ మంత్రి రణధీరుడూ, మరి నలుగురు సంగుడి మంత్రులూ ఉన్నారు. ఆచారం ప్రకారం అందరూ నిరాయుధులుగానే ఉన్నారు. సింహాసనం వెనక

రెండు అడ్డకత్తులూ, రాజవంశ లాంఛ నాలుగల ఒక డాలూ ఉన్నాయి.

రాజపురోహితుడు సంగుణ్ణి లోపకిలి ప్రవేశపెట్టి, తలుపులు మూసి గడియ పెట్టాడు. ఆయన మంత్రాలు చదివి, సంపత్‌ను ఇంద్రజాలం ప్రారంభించ మన్నాడు.

సంపత్ జెండాగల కాగితాన్ని పైకి తీసి, దాన్ని రెండు పక్కలా తిప్పి అందరికీ చూపి, పొట్లంలాగా చుట్టాడు. ఆయనకు సహాయకుడుగా ఉన్న అంగమహారాజు గోడ మీదినుంచి ఒక కత్తి తీసి, కత్తి మొనను పొట్లంలోకి దోపి, చిత్రంగా అటూ ఇటూ కెలికి, కత్తిని నింపాదిగా పైకి లాగాడు. కత్తి మొనకు పాత జెండా వేళ్ళాడుతూ ఉండటం చూసి అందరికీ ఆశ్చర్యం కలిగింది.

తరవాత ఐంద్రజాలికుడి సహాయకుడు సింహాసనాన్ని సమీపించి, ఆ జెండాను పతాక స్తంభంమీద ఉంచి, తాను కాస్తా సింహాసనం మీద కూర్చున్నాడు. ఆయన కత్తిని సంగుడి కేసి పట్టుకుని, "సంగా, నా కంఠ స్వరాన్నిబట్టి నే నెవరో నువు గుర్తించి ఉండాలి. క్షేమం కోరినవాడివైతే లొంగి పో, లేకపోతే ప్రమాదం జరిగి పోతుంది," అన్నాడు.

సంగుడు అన్న కాళ్ళ మీద పడి పోయాడు. సంపత్ గోడమీది నుంచి రెండో కత్తి కూడా తీసేసుకుని, పురోహితుడి పళ్లెంలో వున్న శంఖం తీసి పూరించాడు. బయట వేచి ఉన్న ప్రజలకు అది సంకేతం. అంగమహారాజు పట్ల విశ్వాసంగల రాజభవన రక్షకులు ప్రజలలో చేరిపోయారు. జనం వచ్చి తలుపు తట్టగానే రఘుపతి గడియ తీశాడు.

"అంగమహారాజుకు జై!" అని నినాదాలు చేస్తూ ప్రజలు అంగుణ్ణి దర్బారుకు మోసుకుపోయి సింహాసనం మీద కూర్చోబెట్టారు. సంగుడూ, అతని అనుచరులైన దుర్మార్గులూ చేతులకు బేడీలు పడి, వెనకగా వచ్చి, రక్షకభటుల కాపలా కింద నిలబడ్డారు.



# తెలివైన పంపకం

ఒక రైతుకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు చుటకైనవాడు. రెండోవాడు కాస్త అమాయకుడు. రైతు చనిపోబోతూ పెద్దల ఎదుట తన కొడుకులతో, పెద్దవాడు మూడువేల గజాల చుట్టు కొలతగల భూమిని తాను తీసుకుని, మిగిలినది చిన్నవాడికి ఈయాలనీ, ఈ పంపకం న్యాయాధికారి సమక్షంలో జరగాలనీ అన్నాడు.

తండ్రి పోయాక పెద్దవాడు వెళ్ళి పొలంచుట్టూ కొలిస్తే, అది మూడువేల గజాలే ఉన్నది. వాడు తమ్ముడితో, "పొలమంతా నాదే. నీకు ఏమీ రాదు," అన్నాడు.

చిన్నవాడు ఈ మాట విని కంగారుపడి న్యాయాధికారి వద్దకు వెళ్ళి తన తండ్రి అన్నదీ, తన అన్న చెప్పినదీ చెప్పాడు.

న్యాయాధికారి ఆ అన్నదమ్ములను వెంటపెట్టుకుని వెళ్ళి పొలంచుట్టూ కొలిపించి, చుట్టు కొలత మూడువేల గజాలే ఉండటం గమనించాడు. తరవాత ఆయన ఆ భూమిని అడ్డంగానూ, నిలువుగానూ విభజించి నాలుగు భాగాలు చేసి, ఒకదాని కొకటి ఐమూలగా ఉండే భాగాలు రెండు పెద్దవాణ్ణి ఎన్నుకోమని, మిగిలిన రెండూ చిన్నవాడి కిచ్చేశాడు.

ఇద్దరి పొలాలూ మూడేసి వేల గజాల చుట్టుకొలత కలిగి ఉన్నాయి!

—దుప్పూరి అశోక్‌కుమార్ రెడ్డి





# కల్యాణ వైభోగం

ఒక గ్రామం మధ్య పాతకాలపు పెద్ద రామాలయం ఉండేది. రామశాస్త్రి దానికి అర్చకుడు. ఆ వూళ్ళో ఒక ఆచారం ఉండేది. వూళ్ళో ఎవరైనా చచ్చిపోతే, మూడు రోజులపాటు అర్చనలు లేకుండా రామాలయాన్ని మూసి ఉంచేవారు.

ఊరికి కొద్ది దూరంలో ఒక పట్నం వుండేది. అక్కడ సంత జరిగే రోజున ఊరివాళ్ళు అక్కడి నుంచి ఉప్పులూ, పప్పులూ తెచ్చుకునేవాళ్ళు. ఒక సంత రోజు రామశాస్త్రి పట్నం వెళ్ళి, ఇంటికి కావలసిన సరుకులు కొని, బండికి ఎత్తిస్తూండగా, ఎదురుగా మేడలో ఉండే శెట్టిగారు పిలిచాడు. రామశాస్త్రి శెట్టిని కలుసుకుని, విషయం తెలుసుకున్నాడు.

క్రితం నెల శెట్టిగారి భార్యకు తీవ్రంగా జబ్బు చేసింది. ఆమెకు జబ్బు నిమ్మళిస్తే, వెయ్యి నూటపదహార్లు ఖర్చు చేసి రాముడికి వైభవంగా కల్యాణం చేయిస్తానని మొక్కుకున్నాడు. శెట్టిగారి భార్యకు జబ్బు నయమైపోయింది.

"ఎప్పుడు వద్దామనుకున్నా తీరకుండా ఉన్నది. నాకు లక్ష పనులు. రేపు సాయంత్రం నేనూ, నా భార్యా మీ ఊరు వస్తాం. అన్ని ఏర్పాట్లూ చేయించి ఉంచండి. ఎల్లుండి దేవుడికి కల్యాణం జరిపించి, పేదలకు అన్నదానం చేద్దాం," అన్నాడు శెట్టి రామశాస్త్రితో.

ఆ మాట విని రామశాస్త్రి ఉక్కిరిబిక్కిరి అయాడు. అతని హయాంలో అంత పెద్దఎత్తున దేవుడికి కల్యాణం చేయించినవారు లేరు.

"మహారాజుగా రండి. అన్ని ఏర్పాట్లూ చేసి ఉంచుతాను," అని శెట్టిగారికి చెప్పి, రామశాస్త్రి ఆనందంలో తేలుతూ ఇల్లు చేరాడు.

ఎం. కామేశ్వరరావు

అయన బండిలో ఇల్లు చేరేసరికి చీకటి పడింది. సామాను దించి, బండిని పంపేసి చూసేసరికి, అరుగు మీద ఎవరో పడుకుని ఉన్నట్టు లీలగా కనిపించింది.

"ఎవరు వారు?" అని శాస్త్రి గట్టిగానే అన్నాడు. జవాబు లేదు.

శాస్త్రి గొంతు విని, ఆయన భార్య కాంతమ్మ బయటికి వచ్చి, "ఈ ముద నష్టపు వెధవ ఇంకా వెళ్ళలేదూ? మీరు లోపలికి రండి," అన్నది భర్తతో.

శాస్త్రి లోపలికి వస్తూనే, "ఎవడే వాడు?" అని భార్యను అడిగాడు.

"ఎవడో పొగరుమోతు! సాయంత్రం అనగా వచ్చి, భోజనం పెట్టించమని ఒకటే పోరుపెట్టాడు. పెట్టనంటే, కదల నంటూ అరుగు మీద తిష్ఠవేశాడు. చూస్తే దొంగలా ఉన్నాడు. వాణ్ణి వెళ్ళగొట్టండి," అన్నది కాంతమ్మ.

"భోజనం చేసినాక వాడి సంగతి చూద్దాంలే. ఈ రోజు మన పంట పండింది తెలుసా?" అంటూ రామశాస్త్రి పట్నంలో శెట్టిగారి మొక్కు విషయమంతా చెప్పి, "ఎలా లేదన్నా మనం అర్ధవెయ్యి న్నూట పదహార్లు మిగుల్చుకో వచ్చు. ఆయన మనిద్దరికీ బట్టలు పెట్టకపోడు," అన్నాడు.

కాంతమ్మ తన భర్తకు భోజనం పెట్టింది. శాస్త్రి భోజనం ముగించి,



పడుకునే ఆలోచనలో ఉండగా, ఆమె కిటికీలో నుంచి బయటి అరుగు మీదికి చూసి, "ఆ దౌర్భాగ్యుడింకా అరుగు విడిచి పోలేదు. వెళ్ళి వాణ్ణి పంపించెయ్యండి. లేకపోతే ఏ రాత్రివేళో పెరటి గోడ దూకి లోపలికి వస్తాడు," అని లబలబ లాడింది.

విధిలేక శాస్త్రి మూలనున్న కర్ర తీసుకుని, పెద్దగా చప్పుడు చేస్తూ వీధి తలుపు తెరిచాడు; తరవాత అరుగును కర్రతో గట్టిగా బాదుతూ, "ఎవడ్రా వాడూ? పొమ్మంటే కదలవేం?" అని అరిచాడు.

అరుగుమీది మనిషిలో ఏ కదలికా కనిపించ లేదు.



"అయితే ఇప్పుడు ఏం చేద్దాం?" అన్నది కాంతమ్మ.

"వీణ్ణి ఈ రాత్రికి రాత్రే వల్లకాట్లో పూడ్చి పెట్టెయ్యాలి. ఊరికి కొత్తవాడు గనక, రేపు ఎవరూ వీణ్ణి గురించి పట్టించుకోరు," అన్నాడు శాస్త్రి.

"ఈ మాట కాటికాపరికైనా తెలుస్తుందిగా?" అన్నది కాంతమ్మ.

"డబ్బు పారేస్తే వాడే నోరు మూసుకుంటాడు," అని, శాస్త్రి ఎంతోకాలంగా పోగు చేసి పెట్టెలో దాచుకుంటున్న డబ్బు వంద రూపాయలు తీసి రొండిన కట్టుకుని, లోపల భయంగా ఉన్నా, మొండి ధైర్యంతో చీకట్లో పడి శ్మశానానికి వెళ్ళాడు.

కాటికాపరి శ్మశానం దగ్గిరే గుడిసెలో ఉంటున్నాడు. శాస్త్రి వాణ్ణి బయటికి పిలిచి, సంగతంతా చెప్పి, "ఈ విషయం మూడో కంటివాడికి తెలియగూడదు," అన్నాడు.

శాస్త్రి కోరినట్టు పని ముగించటానికి వంద రూపాయలు అడిగాడు కాటికాపరి. వాడితో బేరమాడి డెభ్భై అయిదు రూపాయలు తీసుకోవటానికి శాస్త్రి వాణ్ణి ఒప్పించి, "నేను వెళ్ళి శవాన్ని తెస్తాను. ఈ లోగా నువు గొయ్యి తవ్వి సిద్ధంగా ఉంచు," అని చెప్పి ఇంటికి వచ్చాడు.

ఏదో అనుమానం తగిలి, శాస్త్రి దగ్గిరగా వెళ్ళి, ఆ మనిషిని కదిపి చూశాడు. ఆ మనిషిలో చలనం లేదు.

"కొంప తీశాడేవ్! వీడు చచ్చినట్టున్నాడు!" అని శాస్త్రి కీచుగా అరిచాడు.

"చస్తే చచ్చాడు! పీడవిరగడయింది! లోపలికి రండి!" అన్నది కాంతమ్మ.

శాస్త్రి లోపలికి వచ్చి, "ఏడిచావ్! పీడ చుట్టుకుంది ఇప్పుడు. వాడు చచ్చినందుకు మూడురోజులపాటు గుడి మూసి ఉంచాలి. శెట్టిగారు ఎల్లుండి చేయించబోయే కల్యాణం మాటేమిటి? ఆయనకు మళ్ళీ ఎప్పటికి వీలు చిక్కుతుందో ఏమో?" అన్నాడు.

కాంతమ్మ ఒక చాప ఇచ్చింది. శాస్త్రి అరుగు మీది మనిషిని అందులో చుట్టి, నెత్తిన పెట్టుకుని బయలుదేరాడు. సగం దూరం వచ్చేసరికి శాస్త్రికి అలుపు వచ్చింది. వీధి అటూ ఇటూ చూసి, ఎవరూ లేరని తెల్చుకుని, శాస్త్రి నెత్తి మీది బరువు ఒక అరుగుమీద దించి, రొప్పుతూ నిలబడ్డాడు.

ఇంతలో శాస్త్రి భుజంమీద చల్లగా చెయ్యి పడింది. శాస్త్రి నిలువెల్లా వణికి, కెవ్వున అరవబోయి ఎలాగో నిగ్రహించుకున్నాడు.

''ఓహో, శాస్త్రిగారా? ఇంత అర్ధరాత్రి వేళ చీకట్లో ఎక్కడికి ప్రయాణం?'' అన్నాడు ఒక వ్యక్తి. శాస్త్రి గుండు తడివి గుర్తుపట్టి.

ఆ గొంతు వెంకయ్య అనే తాగుబోతుది.

''నిద్రపట్టక అలా బయలుదేరాను,'' అన్నాడు శాస్త్రి.

''ఎందుకు అలా రొప్పుతున్నారూ? ఇదేమిటీ? చాప చుట్టలాగుందే? ఇందులో ఏదో వున్నట్టుందే?'' అంటూ మొదలు పెట్టాడు వెంకయ్య.

''అవునుగాని, నువ్వీ పూట కల్లుఅంగడికి పోలేదల్లే ఉందే?'' అన్నాడు శాస్త్రి భయంతో చెమటలు కక్కుతూ.



''కల్లు అంగడి కామయ్యకి పాతిక రూపాయలు బాకీ ఉన్నాను. బాకీ తీర్చితేనేగాని కల్లు పొయ్యనన్నాడు,'' అన్నాడు వెంకయ్య.

శాస్త్రి చప్పున రొండి నుంచి పాతిక రూపాయలూ తీసి, ''ఇదుగో, పాతిక రూపాయలు. వెంటనే కల్లుపాక దగ్గిరికి వెళ్ళిరా, నాయనా!'' అన్నాడు.

వెంకయ్య బెడద తీరిపోయింది.

శాస్త్రి తేలికగా నిట్టూర్చి, చాపచుట్టనెత్తికెత్తుకుని, శ్మశానం చేరుకున్నాడు. కాటికాపరి గొయ్యి తవ్వి సిద్ధంగా ఉంచాడు. శాస్త్రి దించబోతూండగా చాపచుట్ట దభాలున గోతిలో పడింది.

"చచ్చాన్రోయ్!" అని గావుకేక పెట్టి, చాపచుట్టలో నుంచి మనిషి బయటికి వచ్చాడు. శాస్త్రి గుండె గుభేలుమన్నది.

"పిచ్చి శాస్త్రుల్లూ! బతికిన మనిషిని పూడ్చటానికి తెచ్చావా?" అంటూ కాటి కాపరి విరగబడి నవ్వాడు.

"ఇప్పు డెక్కడున్నానూ? నాది మొద్దు నిద్ర!" అన్నాడు ఆ మనిషి.

"ఎక్కడున్నావా? వల్లకాట్లో! పద పద," అన్నాడు శాస్త్రి ఆ మనిషి మీద విరుచుకు పడుతూ.

ఆ మనిషి బిత్తరపోయి, కాలిసత్తువ కొద్దీ పరిగెత్తి వెళ్ళిపోయాడు.

శాస్త్రి కాటికాపరి దగ్గిర డబ్బు వాపసు పుచ్చుకోవాలని చూశాడు. కాటికాపరి జరిగినదంతా బయట పెట్టేస్తానన్నాడు. శవం లేదుగాని, రహస్యం ఉన్నది. అందుచేత శాస్త్రి మారుమాటాడక ఇంటికి తిరిగి వచ్చాడు. ఈ లోపుగా కాంతమ్మ ఒక కునుకు తీసి, తనకు మొగుడు పట్టు చీర కొనిపెట్టినట్టు కల కన్నది.

"ఎల్లుండి ఈపాటికి నీ కల నిజమవు తుందిలే!" అని శాస్త్రి ఆమెకు ధైర్యం చెప్పాడు. కాని, మర్నాడు సాయంకాలా నికి శెట్టిగారు భార్యా సమేతంగా రాలేదు. ఆ మర్నాడు కూడా వాళ్ళ జాడలేదు.

నాలుగు రోజులు శెట్టిగారికోసం ఎదురు చూసి, శాస్త్రే శెట్టిగారి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు.

అప్పుడే శెట్టిగారు ఎక్కడినుంచో తిరిగి వచ్చాడు.

"రా, రా! నీకు నేనే కబురు చేద్దా మనుకుంటున్నాను. నువు కనబడిన రాత్రే మా నాయనమ్మకు ఒంట్లో బాగా లేదని కబురు వచ్చింది. ఊరు దూరమే అయినా బయలుదేరక తప్పలేదు. ఇప్పుడు ఆమెకు కులాసాగానే ఉన్నది. తీరా వెళ్ళాంగదా అని, నా మొక్కు ఆ వూరి దేవాలయంలోనే తీర్చేసు కున్నాను," అన్నాడు శెట్టిగారు.

రాముడి కల్యాణం మాట ఎలా ఉన్నా శాస్త్రి పెళ్ళి బాగా కుదిరింది!





# వీరహనుమాన్

గజపుష్ప లతను సుగ్రీవుడు తన మెడకు చుట్టుకున్న తరవాత రాముడు అతన్ని వెంటబెట్టుకుని కిష్కింధకు వెళ్ళాడు. అతని వెంట ధనుస్సూ, బాణాలూ ఉన్నాయి. రాముడికి ముందు సుగ్రీవుడూ, లక్ష్మణుడూ నడిచారు; అతని వెనకగా వీరుడైన హనుమంతుడూ, నళుడూ, నీలుడూ, తారుడూ నడిచారు.

దారిలో రాముడికి దట్టమైన చెట్లతో కూడిన ఒక మహారణ్యం కనబడింది. అతను సుగ్రీవుణ్ణి ఆ అరణ్యం గురించి అడిగాడు.

సుగ్రీవుడు నడుస్తూనే ఇలా చెప్పాడు:

"ఇది ఒకప్పుడు ఆశ్రమం; చల్లని నీడగల చెట్లతోనూ, రుచిగల కందమూల ఫలాలతోనూ ఉండేది. ఇందులో సప్త జనులనే ఋషులు తపస్సు చేసి శరీరాలతోనే స్వర్గానికి వెళ్ళిపోయారు. ఇప్పుడు ఇందులోకి ఎవరూ ప్రవేశించలేరు; పక్షులూ, జంతువులూ కూడా ప్రవేశించలేవు. ఒక వేళ లోపలికిపోయినా, తిరిగి బయటికి రాలేవు. ఇందులో నుంచి అప్సరసలు నాట్యం చేసేధ్వనులూ, పాడేధ్వనులూ ఎప్పుడూ వినవస్తూంటాయి: వివిధజాతుల పూలచెట్ల నుంచి మంచి సువాసనలు కూడా వస్తాయి. చెట్లపై భాగాల మీద మసి కనిపిస్తున్నది గదా, దానికి కారణం ఏమంటే, ఇందులో సర్వకాలాలలోనూ త్రేతాగ్నులు వెలుగుతూంటాయి."

ఈ మాట విని రామలక్ష్మణులు సప్త జనులను తలచుకుని, ఆ అరణ్యానికి నమస్కారం చేశారు.

అక్కడి నుంచి చాలాదూరం నడిచి వాళ్ళు కిష్కింధను సమీపించి చెట్ల చాటున దాక్కున్నారు.

సుగ్రీవుడు ఒక్కసారి చుట్టూ కలయజూసి, గట్టిగా గొంతెత్తి, వాలిని యుద్ధానికి పిలిచాడు. తరవాత అతను రాముడితో, ఈసారైనా మాట నిలబెట్టుకో మన్నాడు.

''నీ మెడకు లత ఉన్నది గనక నిన్ను తేలికగా గుర్తించగలను. వాలిని ఒకే ఒక బాణంతో కూల్చుతాను. నువు భయపడకు. నేను ఎంత కష్టంలో కూడా అబద్ధం ఆడినవాణ్ణి కాను. ఇక ముందు కూడా ఆడను. నువు ఏమాత్రం భయపడక వాలిని గట్టిగా పిలు.'' అన్నాడు రాముడు.

సుగ్రీవుడు ఆకాశం దద్దరిల్లేటట్టు భయంకరంగా అరిచాడు. ఆ ధ్వని విని పశువులు బెదిరాయి. వనంలో తిరిగే లేళ్ళు చప్పున నిలిచిపోయాయి.

ఈ సింహనాదాన్ని అంతఃపురంలో ఉన్న వాలి విన్నాడు. తనను చూసి హడిలిపోయే సుగ్రీవుడికి ఇంత ధైర్యమా అని వాలికి పట్టరాని ఆగ్రహం కలిగింది. అతను వెంటనే యుద్ధానికి బయలుదేరి వచ్చాడు.

వచ్చేస్తున్న వాలిని తార కౌగలించుకుని ఆపి, ''సుగ్రీవుణ్ణి చంపటానికి



ఈ రాత్రివేళ వెళ్లాలా? తెల్లవారి వెళ్ళ వచ్చు. ఇందులో పౌరుషం ప్రసక్తిలేదు. అతను నీతో సమానమైన బలం కల వాడు కాడు. నేను ఎందుకు వెళ్లవద్దం టున్నానో చెబుతాను. ఒకప్పుడు నీ చేత చావు దెబ్బలు తిని పారిపోయినవాడు మళ్ళీ నీ మీదికి కయ్యానికి వచ్చాడంటే, అతనికి ఎవరి సహాయమో ఉండి ఉంటుంది. లేకపోతే అతను రానేరాడు. 'అతనికి ఎవరి సహాయం ఉన్నా నేను చంపగలను,' అని అనుకోకు. సుగ్రీవుడు తెలివిగలవాడు; తనకు సహాయం వచ్చే వాళ్ళ శక్తిసామర్థ్యాలు చక్కగా పరీ క్షించి గాని రాడు. నీ కన్న పరాక్రమ వంతుణ్ణి సహాయం తీసుకునే వచ్చి ఉంటాడు. అంగదుడు అరణ్యంలోకి వెళ్ళి తిరిగి వచ్చి, ఒక సమాచారం తెచ్చాడు. ఇక్ష్వాకువంశం వాళ్ళూ, దశ రథుడి కొడుకులూ అయిన రామలక్ష్మ ణులు ఋశ్యమూకం మీదికి వచ్చారుట. మహాబలపరాక్రమ సంపన్నులైన ఆ అన్న దమ్ములు సుగ్రీవుడికి సహాయంగా ఉన్నా రుట. ఆ రాముడు విరాధుణ్ణీ, ఖర, దూషణులనూ, కబంధుణ్ణీ చంపి ఉన్నా డుట,'' అన్నది.

తార వాలికి ఈ విధంగా సలహా కూడా ఇచ్చింది :

''రాముడితో విరోధం పెట్టుకునే కన్న సుగ్రీవుడితో స్నేహం చేసుకో. అతన్ని పిలిచి మళ్ళీ యువరాజుగా చెయ్యి.





నీ రక్తం పంచుకున్నవాడే గాని, పరాయి వాడు కాడు గద! నీ మంచి కోరే నేనీ మాట చెబుతున్నానని తెలుసుకో.''

కాని ఆమె మాటలు మహాబలశాలి అయిన వాలికి రుచించలేదు. అతను తారతో ఇలా అన్నాడు:

''సుగ్రీవుడు ఒక వంక నన్ను యుద్ధానికి పిలుస్తూంటే నేను సహించనా? పిరికి దానివి, నీకేమీ తెలియదు. మహా శూరులకు యుద్ధంలో వెనక్కు తీయటం చావు కన్న హీనం. రాముణ్ణి గురించి భయపడకు. అతను నిరపరాధినైన నన్ను చంపి పాపం కట్టుకోడు. నా మేలుకోరే నువు మాట్లాడావు. నా వెంటరాకు. నేను సుగ్రీవుడి మదం అణుస్తాను గాని, చంపను. నా దెబ్బలకు తట్టుకోలేక వాడే పారిపోతాడు.''

తార ఇంకేమీ చెప్పక, వాలికి ప్రదక్షిణం చేసి, యుద్ధంలో అతనికి జయం కలిగించే మంత్రాలు చదివి, తన స్త్రీలతో సహా వెనక్కుపోయింది.

తరవాత వాలి ముందుకు పోయి, తనతో యుద్ధానికి సిద్ధంగా ఉన్న సుగ్రీవుణ్ణి చూశాడు. తాను కూడా సుగ్రీవుడి లాగే నడుము బిగించి, పిడికిలి పట్టి సుగ్రీవుడి మీదికి వెళ్ళాడు. సుగ్రీవుడు కూడా పిడికిలి బిగించి వాలి మీదికి వచ్చాడు.

ఇద్దరూ ఒకరినొకరు పిడికిళ్ళతో పొడుచుకున్నారు. సుగ్రీవుడు ఒక సాల వృక్షం పెరికి, దానితో వాలిని కొట్టాడు. వాలి ఆ దెబ్బకు కొంత చలించాడు. అయితే, క్రమంగా వాలి బలం కన్న సుగ్రీవుడి బలం వేగంగా క్షీణించసాగింది.

సుగ్రీవుడి బలం తగ్గుతూండటమూ, అతను మధ్య మధ్య దిక్కులు చూడటమూ గమనించి, రాముడు వాలిని చంపటానికి అనువైన బాణం ఎన్నుకుని, తన ధనుస్సుకు ఎక్కుపెట్టి, చెవిదాకా లాగి వదిలాడు. అది పెద్ద ధ్వనితో వెళ్ళి, వాలి రొమ్ములో గుచ్చుకున్నది. దాని



దెబ్బకు దిమ్మరపోయి వాలి పడిపోయాడు.

ఇంద్రుడిచ్చిన కాంచనమాల వాలి కంఠంలో ఉండిన కారణం చేత, అతని ప్రాణాలు వెంటనే పోలేదు. అతను తనను కొట్టిన వాడికోసం కళ్ళతో వెతుకుతూంటే, లక్ష్మణుడితో సహా రాముడు వాలి దగ్గిరికి వచ్చాడు. అప్పుడు వాలి రాముణ్ణి చూసి ఇలా అన్నాడు:

"నువు మహారాజు కొడుకువు. గుణవంతుడని కీర్తి తెచ్చుకున్నావు. శాస్త్రం తెలిసినవాడివి. గొప్ప వంశంలో పుట్టావు. బలశౌర్యాలు గలవాడివి. నేను మరొకరితో యుద్ధం చేస్తూండగా నా రొమ్మును బాణంతో కొట్టావే, ఇందువల్ల నీకేం గొప్పతనం వచ్చింది? నువు పొంచి ఉండి నన్ను కొట్టుతావని కూడా నాకు తెలియదే! రాజులకు ఉండవలసిన గుణాలు ఇంద్రియ నిగ్రహమూ, చిత్తశుద్ధీ, ఓర్పూ, సత్యమూ, ధర్మమూ, పరాక్రమమూ, దుష్టశిక్షణా — ఇవి నీలో ఉన్నాయని నమ్మి, తార వద్దంటున్నా యుద్ధానికి వచ్చాను. నువు దుర్బుద్ధివనీ, పాపాచారుడివనీ, లోక వంచకుడవనీ గ్రహించలేకపోయాను. నీకు గాని, నీ-దేశానికి గాని నేనేమీ అపకారం చెయ్యలేదు. నిన్ను అవమానించలేదు. నీతో యుద్ధానికి రాలేదు. మరెవరితోనో యుద్ధం చేస్తున్న నన్ను నువు ఎందుకు కొట్టావు? నన్ను వేట ధర్మంగా కొట్టావనుకునేటందుకు కూడా లేదు; నా చర్మంతో గాని, రోమాలతో గాని, ఎముకలతో గాని, మాంసంతో గాని నీకు పనిలేదు. నీవంటి రాజులవల్ల భూమి చక్కగా పాలించబడదు. నీవంటి కుటిలుడూ, పాపీ దశరథమహారాజు కడుపున ఎలా పుట్టాడు? ఎవరైనా నిన్ను ఇలాటి పని ఎందుకు చేశావని అడిగితే ఏం చెబుతావు? ఈ నీ పరాక్రమం నా మీద చూపకపోతే, నీకు ద్రోహం చేసిన ఆ రావణుడి మీద చూపలేకపోయావా? నువు నాకు ఎదురుగా నిలిచి యుద్ధం

చేసి ఉంటే ఈపాటికి నిన్ను యముడి వద్దకు పంపి ఉందును. నన్ను అడిగి ఉంటే, నీకు ఒక్క రోజు లోపల సీతను వెతికి, తెచ్చి ఇచ్చి ఉందును. సుగ్రీవుడు నన్ను చంపించి వానరరాజు కాగోరటం సహజం. కాని నువు నన్ను చాటునుంచి చంపటం మాత్రం అక్రమం.''

ఇలా చెప్పి, క్రమంగా స్పృహకోల్పోతున్న వాలితో రాముడు, ''నీకు ధర్మ సూక్ష్మం తెలియక నన్ను నిందించావు. ఈ భూప్రపంచమంతా ఇక్ష్వాకుల రాజ్యం. దీనికి భరతుడు రాజు. అతని అనతి మీద మేం ధర్మాన్ని కాపాడుతూ సంచరిస్తున్నాం. నువు ధర్మం తప్పావు. తమ్ముడు కొడుకుతో సమానుడు. నీ తమ్ముడి భార్య అయిన రుమను నువు కాజేశావు. ఆ తప్పుకు నువు ఈ విధంగా శిక్ష పొందావు. అంతేగాక, నాకు సుగ్రీవుడు లక్ష్మణుడి లాటి వాడు. అతని స్నేహం కోసం కూడా నేనీ పని చేశాను. నిన్ను నేను చంపటం అధర్మం ఎంత మాత్రమూ కాదు. నిన్ను చాటున ఉండి కొట్టినందుకు నేనేమీ విచారించటం లేదు. వన మృగాలను కొట్టేవాళ్ళు దాగి ఉండీ, వలలను పన్నటం లాటి అనేక మాయోపాయాలను అవలంబించీ ఆ పని చేస్తారు. తినే జంతువులనే గాక, తినని జంతువులను కూడా రాజర్షులు చంపుతారు. నువు తినరాని మృగానివి,'' అన్నాడు.



ప్రాణం పోయే ముందు వాలి రాముడితో, ''నేను చచ్చిపోతున్నందుకు విచారించను. తారను గురించీ, బంధువులను గురించీ నాకు చింతలేదు. నా చింత అంతా అంగదుణ్ణి గురించి. వాడికి నేనంటే ప్రాణం. నా కోసం బెంగపడతాడు. అతన్ని కాపాడు. వాణ్ణి సుగ్రీవుణ్ణి చూసినట్టు చూడు. తారను సుగ్రీవుడు నా కారణంగా అవమానించకుండా ఉండేటట్టు చూడు'' అన్నాడు.

రాముడు అలాగే చేస్తానని చెప్పాడు. వాలికి స్పృహతప్పింది.

ఈ లోపల వాలి సంగతి తారకు తెలిసింది. ఆమె అమితమైన దుఃఖంతో, కొడుకును వెంట బెట్టుకుని కిష్కింధ నుంచి వచ్చింది. దారిలో ఆమెకు కొందరు వానరులు ఎదురై, "తారా, వెనక్కు వెళ్ళు. నీ కొడుకు అంగదుణ్ణి కాపాడుకో. రాముడి రూపంలో మృత్యువు వచ్చి వాలిని తీసుకుపోతున్నది. నగరద్వారాలు భద్రంగా మూయించి, అంగదుడికి పట్టాభిషేకం చెయ్యి. లేకపోతే నీకు కిష్కింధలో నిలవనీడ దొరకదు; శత్రువులైన వానరులు వచ్చి ఆక్రమించు కుంటారు," అన్నారు.

ఆ మాటకు తార, "నా భర్తే పోగా, కొడుకూ, రాజ్యమూ, నా శరీరమూ ఏమయితే నేం? ఆ వాలి దగ్గిరికే పోతాను," అని తలా, రొమ్ము బాదుకుని ఏడుస్తూ వేగంగా వెళ్ళి, నేల మీద పడి ఉన్న వాలినీ, దగ్గిరే నిలబడి ఉన్న రామ, లక్ష్మణులనూ చూసింది. తరవాత ఆమె వాలి వద్దకు వెళ్ళి, అతన్ని కౌగలించుకుని ఏడ్చింది. తారనూ, అంగదుణ్ణీ చూడగానే సుగ్రీవుడికి కూడా దుఃఖం వచ్చింది.

హనుమంతుడు తారను చూసి, ఆమెను ఈ విధంగా ఓదార్చాడు: "తారా, పోయిన వారిని గురించి దుఃఖించ నవసరం లేదు. ఎందుకంటే, అంతా పోయేవాళ్ళే. విచారించవలసినదీ, దిగులు పడవలసినదీ నిన్ను గురించి. నీకు కొడుకున్నాడు. వాడి యోగక్షేమాలు విచారిస్తూ, వాడి జీవితం తీర్చిదిద్దు. వాలి మహాత్ముడు. అతనికి ఉత్తమ లోకాలు కలిగాయి. అంగదుడు రాజయితే, నువు అతనికి సహాయంగా ఉండు. వాలికి ఉత్తరక్రియలు జరపాలి. అంగదుడికి రాజ్యాభిషేకం చెయ్యవలసివుంది."

ఈ మాటకు తార, "హనుమంతుడా, నువు చెప్పినవేవీ నేను చేసే పనులు కాదు, సుగ్రీవుడు చెయ్యవలసినవి. నేను వాలితో పోవలసినదాన్నే," అన్నది.





# అమరవాణి

దమ, శ్శమః, క్షమా, ధర్మో,
ధృతి, స్సత్యం, పరాక్రమః
పార్థివానాం గుణా (రాజన్)
దండ శ్చా ప్యపరాధిషు. 1

[ఇంద్రియ నిగ్రహమూ, చిత్తశుద్ధీ, ఓర్పూ, ధర్మమూ, ధైర్యమూ, సత్యమూ, పరాక్రమమూ, అపరాధులను దండించటమూ—ఇవి రాజుల గుణాలు.]

నయ శ్చ వినయ శ్చోభౌ,
నిగ్రహానుగ్రహా వపి,
రాజవృత్తి రసంకీర్ణా
న నృపాః కామవృత్తయః. 2

[రాజులు నయ, వినయాలనూ, నిగ్రహానుగ్రహాలనూ తమ చిత్తం వచ్చినట్టు తారుమారు చేయరు.]

శాసనా ద్వా, విమోక్షా ద్వా,
స్తేనః స్తేయా ద్విముచ్యతే,
రాజా త్వశాస న్పాపస్య
త దవాప్నోతి కిల్బిషం. 3

[రాజు శిక్షించినా, మానినా దొంగకు పాపం తొలగిపోతుంది; కాని శిక్షించకుండా వదలిన దొంగ తాలూకు పాపం రాజుకు చుట్టుకుంటుంది.]

రాజు

Photo by S. B. Takalkar



బహుమతి పొందిన వ్యాఖ్య

ముసిముసి నవ్వుల చిన్నది

పంపినవారు : దుగ్గిరాల నాగభూషణం

Photo by K. K. Rao



మండపేట
(తూ॥ గోదావరి జిల్లా)

ముచ్చటపడుతూ వున్నది

- బహుమతి
పొందిన వ్యాఖ్య

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు ఫిబ్రవరి 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైనమాత్రమే రాయాలి.
★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
రాతిలో శిల్పం

మూడవ అట్ట:
రాతి మీద శిల్పం


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3 Arcot Road Madras-600026 Controlling Editor: 'CHAKRAPANI'

V11


వీనస్ మహీజా పిక్చర్స్
నవయుగ
VEEKAY

